సరస్వత్యనుబంధము. 36.

శ్రీరస్తు.

# కకుత్స్థవిజయము.

ఇది

మల్లి అనంత భూపాలప్రణీతము.

(సరస్వతీపత్రికనుండి పునర్ముద్రితము)

కాకినాడ:

శ్రీబాలసరస్వతీముద్రాక్షరశాల.

1904

వెల రు 0—8—0

# పీఠిక.

ఈ కకుత్స్థ విజయమును రచించిన కవి మట్లి అనంతభూపాలుఁడు. ఈతఁడు తన గ్రంథమును తండ్రియగు యెల్లభూపాలునకుఁ గృతియిచ్చెను. తల్లి రంగాంబ. ఇతని రాజధాని పద్యాంతములలో 'సిద్ధవటపటుస్ఫుటభేదన'...యనియుండియుఁ బైభాగము లుప్తమయిన కతన సిద్ధవటమని యూహించుచున్నాము. ఈయన తిరుమల తోళప్పాచార్యుని శిష్యుఁడు. కృష్ణదేవరాయని తరువాతఁ గృతులు రచించిన రాజకవులలో నితఁడొకఁడు. కువలయాశ్వచరిత్రాకారుఁడగు సవరము చిననారాయణనాయక కవి తనతండ్రియగు నారనరాజును వర్ణించుచోఁ 'ఘనకీర్తి మట్లనంత నృపాలముఖ్యగోత్రామరేంద్రులు కొనియాడికొనఁగ' నని చెప్పుటచేతను నా చిననారాయణకవి 17 వ శతాబ్దము మొదటనున్నవాఁడగుటచేతను నీకవి చిననారాయణనాయకకవి తండ్రికాలమువాఁడగుటచేతఁ బదునాఱవశతాబ్దము చివరనున్నవాఁడు. ఇక్కవితండ్రిగారి యాస్థానమున నప్పగుండుపురి వేంకటకవియను కవియున్నట్లును, నతఁడు 'నీకుమారుఁడు కవితాచాతుర్యధురీణుఁడు కావున వానిచే నొక గ్రంథమును గృతిపుచ్చుకొను' మని చెప్పినట్లును దానంజేసి యీతఁడు కృతియిచ్చినట్లును చెప్పియున్నాఁడు. వేంకటకవి యెల్లభూపాలునియొద్దఁ దనగుణములను వర్ణించి చెప్పమిషచే నీకవియుఁ దనవర్ణనమును మిగులఁ జేసికొనియున్నాఁడో లేక యాపద్యములు మాత్రము వేంకటకవి చెప్పెనో తెలియదు. కాని యాపద్యముల శైలి మట్టుకు గ్రంథమునంతయుఁ బోలియేయున్నది. కావునఁ గవియే చెప్పినాఁడని నిర్ణయింపవలెను. లేకయున్న గ్రంథమంతయు వేంకటకవి కృతమే యనవలసివచ్చును. ఈ సంస్థానకవి యగు వేంకటకవి రచియించిన గ్రంథమేదియుఁ గానరాదు. ఇతని తరువాతివాఁ డగుటచేఁ జిననారాయణుని కవిత్వమితని కవిత్వమును బోలియున్న దని చెప్ప వీలులేదుగాని కొన్నికొన్ని పద్యములయందు దానికిఁ దులదూఁగుచున్నది. మొత్తముమీఁదఁ గవిత్వము మిగుల ప్రౌఢమయి సలక్షణమై రసాస్వాదమునకు యోగ్యమయి సందియము లేదు. ఈ గ్రంథమందలి కథయంతయు వ్రాసిన మూఁడుమాటలగును. అట్టికథను వర్ణనాచమత్కారముతోడను గల్పనాచమత్కారముతోడను బెంచెను. తెలుఁగున నాటకములను వ్రాయునలవాటు లేకపోవుటచేఁ గొందఱు కవులు నాటకములనాధారముగను వ్రాసిన ప్రబంధములు కొలఁదినాటకశైలిగనే యున్నవి. ఇందులకు దారిచూపినవాఁడు పింగళి సూరన్నకవి. ఈకవికి సంస్కృతభాషయందలి పాండిత్యము మిక్కి-

టమైనదని కొన్ని ప్రయోగములవలనఁ దెలియవచ్చుచున్నది. మాటలు కూర్చుటలోఁ గూడ నీతఁడు మిక్కిలి తెలివిగలవాఁడు. చిననారాయణుని కల్పాకించుమించుగ సమకాలికుఁ డగునీతని కల్పనయే కారణమని తోఁచుచున్నది కాని తరువాతి వగుటఁ గాబ్లోలు దీనికంటె నదియే యంపముగా నున్నది.

ఈగ్రంథము కవితాశక్తికలిగి పదార్థజ్ఞానము కలిగినవారు తప్ప మఱి యొక రొక్కపద్యమయినను జదువలేని వ్రాఁత గల యొక్కప్రతిమాకుఁ దంజావూరులో దొరకినది. ప్రత్యంతరము కొఱకెంత ప్రయత్నించినను సంప్రాప్తము కాకపోవుటచేఁ దుట్టతుదకా గ్రంథమునే చూచి ముద్రించుటను మొదలుపెట్టితిమి. వ్రాఁతయందలి లోపములే కాక పెక్కుచోట్ల లుప్తభాగములు కూడఁ గలవు. శక్యమైనంతవఱకా లుప్తభాగములు పూరించుచు రసభంగమగునేమో యను భయముచేఁ గవిహృదయ మెఱుఁగఁ జాలక యాభారము చదువరులకే వదలి గ్రంథమంతయు ముద్రించితిమి. ఇది సవరించుటలో మేముపడినప్రయాస యింతింత యనిచెప్పుట కలవిగాదు. నిజముగాఁ గ్రొత్తగ్రంథమునే రచింపఁ బూనిన నిట్టిదైనను గాకపోయిన నింతింత పరిమాణముగలగ్రంథములు పదివ్రాయవచ్చును. ఇట్లు కష్టపడి సవరించినను గొన్నిచోట్ల నింకను మాలోపములుండవచ్చును. ఉన్నవి. రెండవప్రతిదొరకి దానియందైన స్పష్టముగా నున్నయెడల దీనిని బునర్ముద్రణము చేయు భాగ్యము మాకుఁ దటస్థించిన యెడలఁ బైలోపములను సవరించుకొనఁగలుగుదుము. ఒకచోటఁ బ్రత్యంతరమున్న దని తెలిసి యదివచ్చునను ధైర్యముతో నీగ్రంథము ముద్రింప మొదలిడితిమి కాని చివరకది దొరకినదికాదు. లుప్తభాగములున్నను గథాభాగముమాత్రము చెడకుండఁగనే యున్నది. కావునఁ బూరింపనందులకుఁ బండితులు మమ్ము మన్నింతురని తలఁచుచున్నారము.

ఇట్లు విన్నవించు,

ఆంధ్రభాషాభిమాని

శ్రీ. కో. రా. వేం. కృష్ణరావు.

సరస్వతీపత్రికాధిపతి.



శ్రీరస్తు.

# కాకుత్స్థవిజయము.

## ప్రథమాశ్వాసము.

శా. శ్రీపాదాంబురుహద్వయం బిది మదిన్సేవించువాఁ డెవ్వఁడో
యాపుణ్యుం డఱచేతిరత్న మగుమా కన్నట్లుగాఁ దాదృశ
వ్యాపారోన్ముఖరత్నహస్త మగు తత్త్వంబాయురారోగ్యలీ
లాపూర్తు ల్దయఁ గావ్యకర్త కలమేల ల్మంగావరుం డీవుతన్. 1

సీ. శ్రీవత్సమునకు నెచ్చెలిఁ జేయు నేచెల్వ కుచకురంగమదంబు కుహురుకొలిపి
కాపుంచుఁ జైతన్యకలఁ గౌస్తుభంబున నేయంబ ప్రతిబింబ మేఱుపఱచి
వైజయంతికి నొకవరుస మొల్లలు గ్రుచ్చుఁ జిఱునవ్వుఁ గులికి యేచిగురుబోఁడి
యొఱపుఁ జూపులఁ గాంచనోత్తరీయములకు మీనంచ్రాయు నే మెచ్చులాఁడి
మగనిఱొమ్మెక్కె నేకొమ్మ మనుచు వేడ్క, నమ్మహాదేవి వాగ్దేవి యత్తగారు
మధురశీతలసురభివాఙ్మయతరంగ, తతుల మజ్జిహ్వఁ బ్రవహింపఁ దలఁచుఁ గాత. 3

మ. సకలోచ్చ్రక్రమచక్రము న్విజితరక్షశ్శంఖము న్శంఖముం
జకితానందకనందకంబు నకృతస్వారాజముఖ్యామర
ప్రకరస్వాంతగదగ్గదజ్జగదగారక్రీడ దుత్ఫుల్లవై
రికలాలోకకుచాపచాపమును బ్రార్థింతు న్వచశ్శుద్ధికిన్. 4

శా. విస్వగ్వ్యాప్తదరస్మితోత్థతటదేవీసూత్రవత్యుక్తిశు
శ్రూషాప్యాత్మశ్రవణుండు జన్యజనితభ్రూచాలనోద్భూతనై
ర్వ్యేషాప్యసుండు నమత్తురంగముఖ విఘ్నేంద్రాత్మభూస్థాణుఁడీ
విష్వక్సేనుఁడు మత్ప్రణీతము జగద్విఖ్యాతముం జేయుతన్. 5

క. సారెకు మ్రొక్కెద మేధా, వారిజగర్భులకు వ్యాసవాల్మీకులకున్
భారతరామాయణకవి, తారసమాధుర్యధుర్యతాత్పర్యులకున్ 6

గీ. డాఁగురించుచు నీ నెలబాగొనర్తు, మనుచు నాకులరచనల నలసి సంధు
లందుఁ గూర్పక రసములు చిందఁబోసి, కొనెకు గ్రాసార్థికవులు నిక్కపుఁగవులె,

వ. అని యిష్టదేవతానమస్కృతియు సుకవిపురస్కృతియుఁ గుకవితిరస్కృతియుఁ గావించి మేధావైశద్యనిరీక్షాపేక్షం గకుత్స్థవిజయప్రబంధ నిబంధనకుతూహలాయత్తచిత్తుండనై యుండ నొక్కనాఁడు పూర్వదిశాచంచంబున శతమఖకలితంబును నాగ్నేయంబు పగిది రోచిష్మదాకీర్ణంబును దక్షిణంబుచాడ్పున ధర్మాధ్యక్షంబును నైరృతంబువిధంబునఁ బుణ్యజనాధిష్ఠితంబును బ్రతీచిరీతిఁ బ్రచేతోవాసంబును వాయువ్యంబుగతి జగత్ప్రాణతోషకంబును నుదీచిభాతి రాజరాజమహితంబును నీశాన్యంబుకైవడిఁ బ్రద్యుమ్నహరిభాసురంబును గవేరజామధ్యంబునుం బోలె శ్రీరంగాభిరామంబును క్షీరసాగరంబునుం బలెఁ బరమపురుషదీప్యమానంబు నగు పేరోలగంబున బిసవగజసింహుండను సన్మజ్జనకుం డెల్లధరాఖండలుం డంధ్రకవితాపితామహుండును నుభయచ్ఛత్రచామరశంఖసంఘాతాంకుండును నగు నుస్వాఁగొండు రిపుకి వేంకటకవిం జూచి శాశ్వతం బగు ధర్మం బేదియని యడిగిన నక్కవికంఠీరవం బిట్లనియె. 8

ఉ. కోనయయెల్ల వైరినృపకుంజరభంజన కంజనాభసే
వానిరవద్య యాద్య జనవర్ణితదుర్లభకీర్తిసార యతా
నానసఖండరాజరసనాంచలరంగముల న్నటింపఁ ద
న్మానసగర్వపుం దెర దెమల్చి యమర్చితి కీర్తినర్తకిన్. 9

శా. ధారాపాతము వాసినప్పుడె ఘనత్వం బేర్పడుం జంద్రహా
సారూఢి న్విలసిల్లుచున్నపుడు శైత్యం బెల్లఁ గాన్పించు మిరా
నీ రాజన్యభుజాఖడ్గరాజమభివర్ణింపన్వశంబే యుప
గ్రారిధ్వంసక మల్లకోనవిభు నెల్లా రాజకంఠీరవా. 10

గీ. అమితచారిత్ర పుణ్యమార్గములు గలవు, పెక్కులైనను సత్కీర్తికెక్క నిజము
సప్తసంతానముల నందు శాశ్వతంబు, కావ్యమందును సత్కవి కలిగె నీకు. 11

క. మహినీప్రస్తుతుఁ డనంతుఁడు, బహుమహిమలఁ జెప్పనేర్చు భవమాళిధునీ
లహరీఘుమఘుమితవచో, మహితంబులు కృతులు స్వరసమాధురినవురా! 12

సీ. పంకజాతానన ప్రతిపత్తిఁ గడనుంచి మృగరాజపీఠిపై మెట్టుటెంచి
శుకమానసహానభాధకవాక్యములు దుంచి ప్రతిజనార్చాపేక్షమతిఁ దలంచి
పాండురుగాకృతి ప్రకటిమఁ బ్రహసించి మెఱుఁగుఁ జామనచాయ మెలఁగఁ దలఁచి
భావాధికాచారభారము నిరసించి శౌర్యవిద్యాసమాచరణ మెంచి
రాజవేషంబుఁ గాంచు భారతియుటంద్రుఁ, క్రోడభూధరమణికిహార్మ్యనురభిజ్ఞాభి

కుంభినీభారధూర్వహోరుభుజుని, మల్లనంతమహీనాథు మతిసనాథు. 13

వ. మఱియు నమ్మహీజాని వైభవంబు లాకర్ణింపుము. 14

సీ. జడరాశిఁ జొరఁబాఱె బడబానలజ్వాల చిచ్చఱపుహరుఁ జేరె శీతరోచి
యొకమూలఁబడియుండె నుదిగిక్కశానుండు హాలాహలము మ్రింగె శూలపాణి
యాకసం బెగఁ బ్రాఁకె నబ్జాతహితకాంతి పాతాళమునకేగెఁ బాపఱేఁడు
కడలఁగా వెలిచె నక్కనకాచలేంద్రంబు పారికాంక్షితఁగాంచె నారదుండు
నెవని విక్రాంతి కీర్తులయు నేఁచితలుమ, వాని నుతియింప వశమె శేషాహికైన
నిఖిలరాజన్యకోటీర నిహితచరణు, మల్లనంత మహీనాథుమతిసనాథు. 15

క. వనధి యనంతుని ... ... ర
మ్మని నగు పరిపంథిగని, యనురాగముఁ బొందెనంచు నలరెం బ్రేమన్. 16

ఉ. దిక్కులమల్లనంత నరదేవు యశంబునరాతిదుర్యశం
బొక్కటఁ గూడనాడఁ దమరోడిన ... ... ...
... ... ... ... ... ... ...
... ... ... ... డౌపలఁ దాలిచె వాగ్వధూటియున్. 17

సీ. గతశశైశ్వరితాత్మగాంభీర్యులైనను మందసముద్రాఖ్యమొందఁ గనిరి
ఐశ్వర్యబలరాము లైమనకున్నను బహుగణాధిపసీరపాణులైరి
దేవకుమునబంధుభావము ల్లనుచున్న సత్రభుక్కులారి చర్యులైరి
భోగవిస్తృతిశిఖాభోగము ల్లేకున్న వాయుభోజనకృష్ణవర్త్ములైరి
అఘువిధాజాగ్రదురుతరయవనజవన, వాహినీనాయకద్రోహదోహలాత్మ
బాహుశాఖాసమాయిత భవ్యభూమి, మల్లనంతధరానాథమాన్యరిపులు. 18

క. పులుమేయఁ గాననాంతర, ములు డాయ నిజశిశుమోహమునఁ జనఁ బొల్గొ
ల్లలొసఁగఁగ నసిధేనువు విమ, తులతలలఁ దొలుచుననంతదోస్తంభమునన్. 19

సీ. గిరిసమాజము తారగిరిసమాజంబయ్యె నబ్జములెల్లను గలశాబ్జములయ్యె
భూరుహతతికల్పభూరుహతతియయ్యెఁ గాంతులెల్లను జంద్రకాంతులయ్యె
మణికదంబము హీరమణికదంబం బయ్యె హయములెల్లను దివ్యహయములయ్యె
ధేనుబృందము కామధేనుబృందంబయ్యెఁ దమ్ములెల్లను దెల్లదమ్ములయ్యెఁ
బరసమంటిన యినుమును బైఁడియగుటఁ, దెల్లముగఁ జేసెఁ దద్యశం బెల్లదిశల
వానినుతియింప శేషాహికైనవశమె, మల్లనంతమహీనాథు మతిసనాథు. 20

ఉ. గంపరబాలుఁ డెల్లమహికాంతుననంతుఁ డనంతకల్పుఁడు

---

... యీభాగములు మాప్రతిలోలేవు. ప్రత్యంతరము లేదు.

ద్దండభుజాబలుండు భువిఁ బాల్పఁగ వాని యరాతికోటికిన్
గొండలు గాఁగ మున్న సరికొండల దండలు చేసి యొంటకున్
గొండలపండ లయ్యెఁ జనుకొండలపండలకన్న సౌఖ్యముల్.

మ. అమితప్రాభవ ... ... లక్ష్మీసతిన్
విమలాబ్జేక్షణరంగయప్రమణి గోవిందాఖ్యనో బాజిమాం
బ మరాళాంచితయాన ... ...
ప మృగీలోచన లచ్చయ సిరివరోన స్మష్టిశాతోదరిన్.

క. తరుణీమణి లక్ష్మీసతి, తిరువేంగళనాథునుతవితీర్ణిసనాథున్
గరుణాపాథోరాశిం, దరుణారుణవిస్ఫురత్ప్రతాపుం గాంచెన్.

చ. అతనిప్రతాపభానుఁ డుదయంబుఁ గనంగఁ దదన్యరాజదీ
ధితి పరతారకానికరదీప్తియుఁ గీడ్వడె జారచోరసం
తతులగతిం దమోవికృతి దారెడు భూజనరాజితాంగనా
తతగతిమించఁ గాంచె వసుధం దిరువేంగళనాథుఁ డల్పుఁడే.

సీ. ఫాలలోచను ప్రోల హాలాహలము మెచ్చు శశిప్రోల రాహువు సన్నుతిం
శరదంబుదము చెంత ఝంఝానిలము సెంచుఁ రుహీనసంతతిచెంత మిహిరు
నళినసంతతిచెంత నాగంబు స్తుతిసేయు నురగవల్లభు పొంత గరుడు నుడువు
వారిదంతికడఁ గాళికాశ్వముఁ గొనియాడు భారతికడ వీరభామఁ బొగడ
మట్ల తిరువేంగళనృపాలు మహితకీర్తి, యెంతగయ్యాళి రచ్చలకెల్లనెక్కె
తత్తదుచితస్థలంబులఁ దవిలితవిలి, ... ...

ఉ. వీరగుణాధినాథుఁ దిరువేంగళనాథు దయాసనాథు నం
భోరుహలోచనామదనమోహనవిగ్రహు పండితారిరా.
డ్వీరు లసద్యశోజిత పటీర హిమాచలు సెన్నవచ్చు గం
భీరభుజాసిఁ జేసె గృహమేధులఁగా నలకూబరాదులన్.

ఉ. కాచినమీఁదఁ గాని మతికల్పకశాఖి ఫలింపదెన్నఁడుం
గాచినఁ గాయకున్నఁ గలకాలము మానుఫలించు నంచు నీ
భూచరఖేచరుల్ నిరతము న్వినుతింతురు విస్ఫురద్వచో
వీచులఁ బొంగి మట్లి తిరువేంగళనాథుని ధీసనాథునిన్.

ఉ. వీరవరుండు మట్లి తిరువేంగళనాథుఁడు గాంచెఁ జెన్నమాం
భోరుహనేత్రయందు బుధపూజ్యుఁ గుమారు ననంతసర్వధా

## ప్రథమాశ్వాసము.

శ్రీరమణాగ్రగణ్యు నురరీకృతధైర్యుని నెల్లభూసురా
సీరు నరాతిలోకపరిసేవ్యపదాబ్జు ననంతభూభుజున్.

సీ. కరుణాగరిష్ఠులు కమలాక్షుఁ డనియును వీరాగ్రగణ్యులు విజయుఁ డనియు
దాతలం దఖుఁ గల్పధరణీజమనియును సత్యశీలురు హరిశ్చంద్రుఁ డనియు
భోగసంపన్నులు పురుహూతుఁ డనియును వైణికాగ్రేసరు ల్వాణియనియు
బుధులెల్లరును శేషభోగీంద్రుఁ డనియును హరిభక్తులెల్లఁ బ్రహ్లాదుఁ డనియు
నొరఁ గొనియాడఁ గాఁపురంబుండు నేమొ, దయయు శౌర్యంబునీగిసత్యవ్రతం
విభవసంగీతపాండిత్య విష్ణుభక్తు, లనఁగ దనరుఁ గుమారుఁ డనంతవిభుఁడు.

సీ. శాత్రవాభ్రవ్రాతఝంఝానిలం బెవ్వఁ డెవ్వాఁడు రిపుతమోహిమకరుండు
కుటిలాసుహృద్వింధ్యకుంభోద్భవుం డెవ్వఁ డెవ్వాఁడు రిపుభూభృదింద్రహేతి
వైరిభోగివ్రాత వైనతేయుం డెవ్వఁ డెవ్వాఁడు రిపుసింధురేభవైరి
దర్పితారాతిద్రుమదావపావకుఁ డెవ్వఁ డెవ్వాఁడు రిపుహిమాహిమకరుండు
వాఁడు విలసిల్లు దశదిశావలభి సులభ, ఢౌకమానానకాసదృగ్ధ్వాన్ని నాద
బధిరపరిపంథిసైంధవ ప్రబలమాహ్వ, దిభుఁడు తిరువేంగళనృపాలు నెల్లవిభుఁ

సీ. వేయుమొగంబుల విభజనం బెడలించి యాసనం బొకఁడౌ ననంతుఁ డనఁగ
నెపమోచికొనియున్న యిందిర నేత్రాంబుజాసక్తఁ జేయు ననంతుఁ డనఁగ
సర్వరాజతమాని జనపతిత్వముఁ బూని యఖిలోర్విఁ దాల్చు ననంతుఁ డనఁగ
నలుగేలు నిరుగేలు నలువునఁ గొనకొని యనుకంపఁ దాల్చు ననంతుఁ డనఁగ
దినదినంబును జాలవర్ధిష్ణుఁ డయ్యె, మల్లనంతునిగారాబు మనుమఁ డాప్త
పద్మహేళి యనంతనృపాలమౌళి, పుణ్యగుణభాసమానుఁ డగణ్యయశుఁడు.

వ. అని యక్కవిపుంగవుండు విన్నవింప సంతోషతరంగితాంతరంగుం డగు మ
నభిప్రాయం బెఱింగి మున్న నేరచియింపఁ బూనిన కాకుత్స్థవిజయం బను ప్ర
ధంబుఁ దదంకితంబుఁ జేయం బూని యీప్రబంధంబున కలంకారం బగు నా
భూవల్లభువంశావతారం బభివర్ణించెద.

సీ. భరితచక్రద్వంద్వకరశాలిగాఁ జేసె నేకచక్రధురీణుఁ డీతఁ డయ్యె
నచలశార్ఙ్గ్యోఘుసమాసక్తుగాఁ జేసె నేకశార్ఙ్గవిభాసి యీతఁ డయ్యెఁ
బద్మాళివికసనప్రతిపాదిగాఁ జేసె నేకపద్మాసనుఁ డీతఁ డయ్యె
సప్తతార్క్ష్యవిభ్రాజిసంచారుఁగాఁ జేసె నేకతార్క్ష్యాధ్యక్షుఁ డీతఁ డయ్యె
నలిననాభుఁ డితఁడు నావానివలకన్న, వాని కెంతో యగుటనలరమించి

లోకమునఁ జరించు లోకసమాలోక, భాంధవుం డను లోకబాంధవుండు. 33

క. మనువుఁ గనె నాతఁ డతఁడా, తని కిక్ష్వాకుఁడు జనించెఁ దద్వంశమున
స్వనజదళాక్షుఁడు దశరథ, జనపతికుదయించె రామచంద్రుం డనఁగన్. 34

క. ఆలోకబంధుకులమున, నాలోకాలోకవేష్టితావని యెల్లన్
బాలించె బొమ్మధరణీ, పాలుఁడు జన్మించి భూమిపాలురు గొల్వన్. 35

క. బొమ్మను మేధావిధిచేఁ, బొమ్మను భోగమున నింద్రుఁ బొమ్మను యశమ
న్బొమ్మను నటింపఁ జేయును, బొమ్మనరోత్తముఁడు బుధులఁ బొమ్మనఁ దెపుడున్.

క. తామరసబాంధవాన్వయ, భూమీశ్వరమౌళి బొమ్మభూవిభుఁ డతఁడా
సోమధరావరు నిమ్మ, క్ష్మామహిళాభర్త నిప్పజనపతిఁ గాంచెన్. 37

వ. అందు. 38

సీ. సోమభూజానికి సుతులుజన్మించిరి పోతరాజును జిన్నభూవిభుండు
బొమ్మరాజు నరసభూజాని కొండ్రాజు వారిలో బొమ్మభూవరుఁడు గాంచె
వరద వైయారి భూవరులఁ జిన్నమయందుఁ బైఁడిరాజును రామపార్థివేంద్రు
జిల్లభూపాలుని జినయెల్లధాత్రీశు రామమాంబాకుంపరవనయందు
సంకువరదాధిపుఁడు కృష్ణమాంబుజాక్షి, వలన వైయారి మేదినీవరుని గాంచి
జారచోరాదిభయములు సడలఁ జేసి, ధాత్రిపాలించె భుజబలోద్దండుఁ డగుచు.

చ. వనజదళాక్షుశంకరులు వార్ధికి నద్రికిఁ బోలెఁ గృష్ణరా
యనికి ననుంగు టల్లుఁ డటులై తనరు న్వరపక్షమాధవుం
డనిమిషవాహినీ మునిగజాశ్వమహీసురహధేనుభీమవా
హన మకుటావతంస కుధరాభరణాదిక హేతుకీర్తి గాయె. 40

చ. వరదుఁ డతండు గాంచిన యవారితకీర్తి నయారిరాజభూ
హరిహయుఁ డౌనతండు వరదాఖ్యులనువ్వర వేంకటాద్రి భూ
వరవరుఁ జెన్నమాంబ యను వారిజలోచనయందుఁ దిమ్మమా
సరసిరుహాక్షియందు నరసప్రభుఁ గాంచె నృపాగ్రగణ్యులన్. 41

వ. పోతరాజు రెండవదేవియగు రామమాంబకుం బ్రథమపుత్రుండైన పైఁడిరాజునన్వ
యం బెట్టిదనిన. 42

గీ. పోతవిభుని పైఁడిభూపాలకుఁడువసం, తాంబయను సరోరుహాక్షివలన
వరదరాజుఁ బోతధరణీశు రామప్ప, రామచంద్రు నాదిరాజుఁ గాంచె. 43

క. ఆదినృపాలకనిభుఁడగు, నాదినృపాలకుఁడు వేంకటాధీశ్వరు వ

ర్యాదిమసాధ్వీతతినిభ, తాదరఁ గోవిందమాంబ యందుం గాంచెన్. 44

వ. ఆపైఁడిరాజు రెండవతమ్ముం డగు చిట్టిరాజు నన్వయం బెట్టిదనిన. 45

క. నతధరణీశుఁడు చిట్టి, క్షితిపతి బొమ్మాంబవలన శ్రీరంగమహీ
పతిఁ గృష్ణధరాజంభా, హితుఁ గోనమయుం దాసరింద్రుం గాంచెన్. 46

వ. అందు. 47

మ. తనధీరత్వము హేమభూమిధరగంధధ్వంస దంభోళిగాఁ
దనగాంభీర్యము సింధునిర్మథనమంథానాగరాజంబుగాఁ
దనదానప్రౌఢత్వము భూరివారిదసముద్యద్గంధవాహంబుగా
మనెఁ జిట్టిరాజు సిరంగభూవిభుఁడు సామ్రాజ్యప్రథాశాలియై 48

వ. ఆచిట్టిసూజానితమ్ముం డగు చిన్నయెల్లమరాజువంశం బెట్టిదనిన. 49

క. అతఁడు చినయెల్లభూపతి, యతిలోకయశుండు నరసమాంబికయను నా
సతివలనఁ గాంచె సుధా, చతురాననుఁ జిన్ననంత జగతీనాథున్. 50

వ. సోమభూజాని రెండవసుతుం డగు చిన్నభూపాలు నన్వయం బెట్టిదనిన. 51

సీ. చిన్నభూపాలుండు చెన్నమాంగనయందు గోవిందధరణీశ కుంజరమును
దిప్పమాంగన యను దేవేరివలనను బోతరాజును సోమభూతలేశుఁ
దిరుమలాంబాతలోదరియందుఁ గృష్ణభూరమణుని గోనేటిరాజు నోబ
ధారుణీశ్వరుఁ జిన్నధరణీతలేశ్వరు శ్రుతిమార్గహితులగు సుతులఁ గాంచె
నతని తమ్ముఁడు నరసగోత్రాధివరుఁడు, తిరుమలాధీశు నారపధరణినాథు
నరసమాంగనయందును నరసరాజ, వరుని జెన్నమాంభోజాక్షి వలనఁ గాంచె. 52

సీ. వారిలోఁ దిరుమలభూరమణుఁడు గాంచె రంగమాంబయనులతాంగివలన
నారాయణుని రామనరవరాగ్రేసరు నంగనారాయణుఁ డనినవిభుఁడు
లక్ష్మాంబయందుఁ దిమ్మక్ష్మాతలాధీశు రంగభూవరుఁ జిన్నరామచంద్రు
కామరాజును నల్వురను గాంచెఁ బుత్రుల నతనితమ్ముఁడు నారపాహ్వయుండు
నరసమాంగనయందుఁ జెన్నక్షమాప, శేషనోబభూవిభుఁ గోనమాశశిముఖి
యందుఁ గృష్ణమహీశు రాజమ్మ దిమ్మ, రాజమణిఁ గాంచె భోజాధిరాజనిభుల. 53

సీ. వారిలోఁ గృష్ణమహీరమణుఁడు నరసింగాంబ యనుకోమలాంగి వలనఁ
బెదచెన్నకేశవపృథివీశులను గోనమహీనాథుఁ గాంచెఁ దిమ్మప్రభుండు
లక్ష్మమ్మయనిన వల్లభయందుఁ జినచెన్నరాజును రాజమరాజుఁ గాంచెఁ
జినచెన్నఁ డంబులోఁ జెన్నకృష్ణమహీశుఁ గాంచె మంగమయను కాంతవలన

సోమభూజాని యేనవసుతుఁడు కొండప, రాజమాణిఁ గాంచె రామమాంబమణివలనఁ
గోనభూవరుఁ బెదలింగమానవేంద్రుఁ, జిన్నలింగాఖ్యుఁ దిమ్మయక్షితిబిడౌజు. 54

సీ. వారిలోపలఁ గోనవసుమతీనాథుండు తిమ్మమాలక్కమాదేవులందు
రఘుపతిభూనాథు రంగనాథనరేంద్రు రాజమప్రభునిఁ గొండ్రాజవరుని
లక్ష్మీపతికుమారపక్ష్మలాధీశు వరుసఁ బుత్రుల నాలుగురను గాంచెఁ
బెదలింగభూజంభభేది కోనమయందు రామప్పఁ దమ్మభూరమణవర్యు
రాజమహీనాథుఁ గృష్ణధరాతలేంద్రుఁ, గాంచెఁ జినలింగభూజాని గనియెఁ బ్రేమఁ
దనయవర్యులఁ గొండమాతరుణివలన, నెల్లధాత్రీశపైఁడిభూవల్లభులను. 55

వ. సోమరాజు పినతమ్ముం డగు తిప్పరాజు వంశం బెట్టి దనిన. 56

సీ. తిప్పభూపాలుఁడాదినృపాలు గుండ్రాజుఁ గోనప్పఁ దిమ్మభూజానిఁ బెద్ద
సోమరాజును జిన్నసోమరాజును గాంచె వారిలో నాదిభూవరుఁడు గాంచెఁ
గొండప్ప నాతఁడు గోవిందరాజును గోనేటిగాంచె నాగుండరాజు
గోవిందభూపతి కొండప్పఁ దిరుమల రాజునుగాంచె గుండ్రాజునకును
దమ్మఁడయినకోన ధరణీశవుఁడుగాంచె, నరసరాజుఁ బోతనరణినాథు
సోమరాజు చిన్నభూవిభునిగాంచె, బాలరాజునతివిశాలయశుల. 57

గీ. తిప్పభూవరు సుతులలోఁ దిమ్మరాజు, కనియె వేంకటరాజుఁ దదనుజుఁడైన
పిన్నసోమధరావరుఁ డన్నరాజుఁ, గోనవిభు వెంగలక్షమాజానిఁ గాంచె. 58

వ. సోమరాజు ననుజన్ముండును దిప్పరాజున కగ్రజుండు నగు తిమ్మరాజుగుణంబు
లెట్టివనిన. 59

సీ. నిత్యప్రవర్తిత నిర్మలాచారంబు లశ్రాంతవిహితదేవతార్చనములు
నిరతధర్మవిచారనిష్ఠావిశేషంబు లనవరతార్యసేవాదరములు
సంతతాతిథిసంఘసంభావనంబులు ననిశవిద్యావిలాసాగమములు
ప్రతిదినకల్యాణబంధురోద్యోగము లసితాధ్వరోత్సవ సంభ్రమములు
నంతకంతకు నానాఁట నతిశయిల్లఁ, గుంటికాలాంధు ధర్మవు కుంటుమాన్ప
నాదిభూనాథుః దలపించె ననఁగమించె, బొమ్మనరనాయకుని తిమ్మభూభుజుండు.

గీ. బొమ్మవిభునితిమ్మ భూపాలకుఁడతండు, నాగమాంబయనెడు నాతివలన
సుతుల నతులశితియశోధనులనుగాంచెఁ, గోనవిభువనంతమానవేంద్రు. 61

సీ. వారిలోఁ గోనభూవరునితమ్ముఁ డనంతుఁ డెఱ్ఱమాంగనయను నింతివలనఁ
బాపరాజును భీమభూపాలుఁ దిరుమలరాజును వేంకటరాజుఁ గాంచె

నందుఁ బాపమహీశుఁ డాత్మజన్ములఁ గాంచెఁ గొండమాంగనయందుఁ గోనరాజు
నెల్లవిభుననంతు నిందుఁ గోనవిభుండు రఘునాథుఁ గొండమారమణివలన
వేంకటాంబయందున ననంత విభుని గాంచె, నతఁ డనంతభూజాని కీర్త్యంబవలనఁ
గనియెఁ గాశేరిరంగనాథుని దనూజుఁ, దత్కులం బిట్లు తామరతంపరయ్యె. 62

వ. పాపరాజున ననుజన్ముండగు నాగరాజునన్వయం బెట్టిదనిన. 63

క. ఆనాగధరిత్రీశాం, శానాథుఁడు గాంచె రామనరవరు సిద్ధాం
బానలినేత్రవలన, స్మీనపతాకుని పయోజనేత్రుఁడు వోలెన్ 64

క. ఏపునఁ జరియించెం బ్ర, ధీపాలకచణుఁడు రామవిభుఁ డహితనృప
వ్యాపారాపారమహా, కూపారాగస్త్య సదృశగురుతర మహిమై 65

క. క్షితిముఖలోకాంతరసం, వితతయశుఁ డనంతరాజు వేంకట ధాత్రీ
పతి వేంకటాంబవలన, స్సుతుఁ గాంచెం గృష్ణుబలనిషూదనభాసున్ 66

క. ధారాదత్తం బీవసు, ధారాజ్యము చేసెఁ గృష్ణధాత్రీపతి మే
ధారాశి బుధుల కరికసి, ధారాదత్తంబు స్వర్గతలముం జేసెన్ 67

వ. తిమ్మరాజు తనూభవుండును ననంతరాజు నగ్రజుండు నగు కోనరాజు గుణంబు లె
ట్టి వనిన. 68

సీ. వాత్సల్యతరతమత్వము చూచుటకుఁ బోలెఁ గల్పకద్రుమసీమఁ గ్రాలువారు
రమణీయ తేజఃపరామర్శకును బోలెఁ బంకజాప్తునిదూఱఁ బాఱువారు
ధైర్యప్రమాణంబుఁ దెలుపోయుటకుఁ బోలెఁ గిరిగుహాగేహాళిఁ గెరలువారు
గాంభీర్యపరిమాణకథ చర్చకును బోలె జడరాశిలోఁ బడినడుచువారు
నై చరింతురు నిఖిల దిశాంతరముల, హేతిహత భీతపరిపంథిభూతలేశు
లద్భుతంబందు టరుదె కోనావనీశు, దాన తేజోగభీరతా ధైర్యములకు. 69

ఉ. స్థిరజయుఁ డైన కోనసరదేవు యశోవనరాశి యాసుధా
కరునకు బొమ్మబంటి కలకంఠుని తొత్తుకబంటి నాకరా
డ్ద్విరదము చెక్కుబంటి ఫణిదేవుని కన్నులబంటి శారదాం
బురుహావిశాలనేత్ర తలముక్కలునై విహరించు మించుగన్. 70

క. ఆకోనక్ష్మాతలపతి, శ్రీకాంతుఁడు లక్ష్మిఁ బోలెఁ జిన్నమదేవిన్
రాకాకోకాహితముఖి, నాక్షత్తకణవివాహ మయ్యెం బ్రీతిన్. 71

సీ. వల్లభు నెదఁ గోరి యెల్లప్పుడును నుండు నిందిరాదేవికి నీడనంగ
మగని దేహములోన సగమై ప్రవర్తించు హిమశైలకన్యకు నెనయనంగ

బలిసమ్ముఖంబునం బాయకవర్తించు శారదాదేవికి జోటి యనఁగ
వరుసహస్రనేత్రుణాదరణమునుం గాంచు పౌలోమితోఁ బోల్పఁబోలు ననఁగ
సకలసాధ్వీజనంబులు సన్నుతింపఁ, బతియ దైవంబుగా గోరి పరిఢవిల్లు
విష్ణుచరణాబ్జవిస్రంభ విగతదంభ, చికురజితనీలరోలంబ చిన్నమాంబ. 72

క. ఆనలినేక్షణవలనం, గోనధరావరుఁడు కనియెఁ గొడుకుల నెల్ల
తమ్మనాథునిఁ దిమ్మమహీ, జానిన్ రవివిభులఁ బ్రసవసాయకనిభులన్. 73

వ. అందుఁ దిమ్మరాజానన్వయం బెట్టి దనిన. 74

ఉ. ధీవినుతాఖ్యుఁ డౌనతఁడు తిమ్మనృపాలకశౌరి దానెమా
దేవులయందుఁ బైఁడినరదేవవరుం బినకోనరాజు రం
గానవిభు న్నరఁగనసుధాధిపునిం గనియెం దనూజులన్
భావితవైరివీరుల సుధాకరనిర్మలకీర్తిహారులన్. 75

ఉ. పైఁడినృపాలకుం డనిన బంగరుపేరది నిక్కమౌటకున్
బైఁడివసు ధరావరుఁ డపారకృపానవరాశి నిచ్చలున్
బైఁడినసంతమాడు ధరపైఁ గనకాంబరమునం జనుం జామీ
పైఁడిగఁ జేయు నయ్యనసిపాలుని తేజము దానజాండమున్. 76

సీ. పరభూమిభృత్పక్షపాటవాంతకరుండు ఘనవారణారోహకరణదక్షుఁ
డరిబలమదభేదనాపాదిభుజశాలి హితసహస్రేక్షణాన్వితగాత్రుఁ
డహితపాకాచారహారి విక్రమశాలి సంతానకల్పితోత్సవభరుండు
శత్రువారవిదారి శతకోటి తరవారికృతసుధాహారసత్కీర్తియుక్తుఁ
డింద్రుఁ డాకోనభూపాలు నేలదొరయఁ, డేల ఘనుఁడయ్యె గోనభూపాలుఁ డనినఁ
గోనభూజానిసత్రవితాన, మొసఁగు, సత్రముల వెంటఁ దిరుగు నాజంభభేది. 77

ఉ. బల్లిదుఁ డైన కోనసరపాలకుఁ డాతఁడు గాంచె నూబమా
హల్లకగంధియందు సమిదగ్రరిపుగ్రహణోగ్రశాంబరీ
భిల్లుని నెల్లభూభుజుని భీకరతాకరవిద్విషద్విటీ
పల్లవుఁ దిమ్మరాజు రణపార్థునిఁ గస్తురి రంగనాథునిన్. 78

వ. ఆకోనరాజు ననుజన్ముల గుణంబు లెట్టి వనిన. 79

చ. వనజభవాండ భూభువనవల్లభు లెల్లరు నెత్తిగానతం
బని మొన షణ్ముఖస్థితి మహామహుఁ డౌనని సన్నుతింపఁగా
వనఁబనుఁజా వసుంధర సహస్రముఖానితి సంగరాంగణం

క్కనినయినం దహించు వగ గానఁడు దానను నెంచ శక్యమే
ధనధనదాభు చిన్నవరప్రభు తేజము పేర్మి యేరికిన్. 89

సీ. నిమిషార్ధవిచ్ఛిన్ననీరంధ్రవిద్విషద్గురుశిరస్త్రాణము లొక్కఁడిగ్రుడ్డు
లభియాతి తనుధావసృగాపగాకోటి యాహారపాంబును ద్రాప నావుపాలు
కదనాహితామితగంధ దంతావళీగాత్రకాండంబులు కప్పగములు
పరిపంథిభూధవప్రాణసందోహంబులనిశంబు భుజియించు ననిలసమితి
గాఁగ నిరతంబుఁ బోషించుఁ గయ్యములను, జిన్నతిమ్మనరేంద్రుఁడు చిరయశుండు
దాయపైఁ బడి నాలుక ల్గ్రోయునట్టి, జిష్ణుబాహార్గళకృపాణ కృష్ణ ఫణిని. 90

వ. ఏతద్వంశసింధుసుధాధాముండును దిమ్మరాజునకు నగ్రజుండును మదీయ జనకుం
డును గోనరాజతనూభవుండుఁ జిన్నమాంబాగర్భశుక్తిముక్తాఫలంబు నగు నెల్లధ
రాఖండలు నఖండితగుణంబు లెట్టివనిన. 91

సీ. హరిపదాచలమహాధ్యాసులు గాకున్న హరిపదాచలమహాధ్యాసు లైరి
భృతమహావనమార్గరీతులు గాకున్న భృతమహావనమార్గ రీతు లైరి
బహులాభరణభీరుసహితులు గాకున్న బహులాభరణభీరుసహితు లైరి
ధర్మసంధాధీనకర్ములు గాకున్న ధర్మసంధాధీనకర్ము లైరి
వాసవాశాదికాశాచమూసమూహ, తాడితోర్వీచలద్రజస్స్థగితతపన
మట్లిమెల్లధరానాథమహితశాత, హేతిహతభీతమదవదరాతినృపులు. 92

ఉ. ఎక్కడఁ గాన మెల్లధరణీశ్వరు హేతికరాతిభీతిమై
నెక్కనిధారుణీధరము నేగని దుర్గదిగంతరాళముం
ద్రొక్కని కాననాంతరముఁ దోఁగని దివ్యనదీనదంబులుం
గ్రొమ్మెక్కని రాలునుం దినని మూలపలాశపలాశజాలమున్. 93

సీ. గాంభీర్యభవకీర్తి కలశపాథోరాశి వాచాలతాకీర్తి వాగ్వధూటి
భూమిభరణకీర్తి భోగిలోకస్వామి సాహసార్జితకీర్తి శంకరుండు
సంగీతజనికీర్తి జలజాతభవసూతి దాతృత్వకీర్తి సంతానశాఖి
ధైర్యధారాకీర్తి తారాచలేంద్రంబు వదనప్రభాకీర్తి వనజవైరి
గాఁగ విహరించు నిఖిలభూకాంతమౌళి, పటహభాంకారకారణప్రళయకాల
భైరవారావశంకానిబద్ధబుద్ధి, విద్విషద్వీరుఁ డెల్లపృథ్వీవరుండు. 94

సీ. ఝిల్లికాఝుంకారవల్లలతానిద్రితాహివేష్టితకంఠబాహులగుచు
దావపావకదగ్ధ ధరణీరుహశ్వేత భసితపాండురదేహపాళులగుచు

నభ్యంగదూరమహాజటీకృతకేశపాశభారశిరోవిభాగు లగుచు గహనధావననిదాఘప్రస్వేదజలసనీ సంగతిలసదుత్తమాంగు లగుచుఁ ప్రియసతీవామపార్శ్వమై చెరయుచున్న, నీశ్వరత్నంబు భజియించుచు రే యటించు నహితకాంతలఁ గాంతుల నడలఁజేయు, భూమిధరదాసిభుజుఁ డెల్లభూభుజుండు.



షష్ఠ్యంతములు.

క. ఏతాదృగ్గుణమణిగణ, జాతాతతకీర్తి భోగ్యశశఘనమనుసం
ఘాతాని ... ... ... ... 97

క. ... ... రాహుగ్రహోగ్రా
తురతరపరిపంథిమహాఖరాం, బురహారికి యజనపుష్టిపురుహూతునకున్. 98

క. అభ్రము వల్లభ ... ... ...
... ... ... భూభృద్భర్తృతికిన్. 99

క. పటహీభూతక్ష్వేడా, భటజాతీభూతబాహు ఫలితకరోరో
ద్భటఘటిత స్ఫటిపట పటు, పుటభేదన ... ... 100

వ. ... ... నాసమర్పింపంబూనినకథకుల్ స్థవిజయం బను మహాప్రబం
ధంబునకుం గథాక్రమం బెట్టి దనిన. 101

క. శ్రీనిత్య వైభవాస్పద ... ... ...
... ... ... జగముల వాగడన్. 102

శా. ఆశీతాంశుకులావతంస మనుజా పాస్థానసన్యాసముల్
వైశంపాయను జూచి యి ట్లనియె ... ...
... ... ... గోష్ఠీనా
కాశాస్యంబు పునః పునః శ్రవణ మయ్యా విూరు వాగ్రుస్స్వేగిన్. 103

వ. అని మఱియు సభాసదుల కానందంబుగా నభ్యర్చించి ప్రా ... 104

క. ... ... ... ప్రదనాభిరాజ్యవనితాజనతా
రతిరాజభోగసంపద, నతిలోకం బొనర్చెనయ్య యాద్యులలోనన్. 105

క. ఈదేశవిశేషంబున, నీ ... ... ...
... ... ... ... 106

క. అన విని కృష్ణద్వైపా, యనముని శిష్యుండు దలంచి యంతటి రాజో
జనమేజయభూవరయా, మనునం ... ... ...

గీ. అందికొన్నాఁడు మన్నాఁడు కంచుతేని, యెల్లసిరులను నెల్లయెూ యొవ్వఁడున్నఁ

త్కరలక్ష్మిం దగి రాజధాని జితనాకస్ఫూర్తి మించు న్మహిన్. 124

సీ. సతతశ్రుతిస్మృతిక్షుణ్ణభాగ్యతఁ దానశీలమై సదాచారకలిత మగుచు
సత్రాసకృద్రసస్యందనవ్యాపారములఁ దెలుఁగంటి విద్యలు నడుపుచు
హంసరథాంగబలాభిరామసరోచిరాహ్లాదభరితమై యందమొంది
ప్రౌఢభుజంగవాక్ప్రాబల్యముఖరమై కమనీయవనమాలికలఁ దనర్చి
వింటికంటె నేమి వెలితి నానచ్చోట, జంపుగను నీలానిలింపగణము
చూడమే జపాప్రసూనసన్నిధినున్న, స్ఫటికమెట్టులున్నఁ బ్రాప్తదీప్తి. 135

క. కుధరశరాసను శౌర్యము, మధురశరాసనుని సౌకుమార్యము గలవా
రధికరథికు లధిగతనిర, వధికయశు ల్సూర్యసోమవంశజు లందున్. 126

క. పెనగరిగరిడికందుఁ, బదింట నైదింట వచ్చి పనివిన్న కేళిన్
బొదువఁబడి చూతు రెల్లరుఁ, గొదమపులులవంటి రాచకొడుకుల వీటన్. 127

క. వేలాసృష్టికిఁ బ్రతియనఁ, గాఁ లోఁగిరి గాక రజతకాంచనమణులం
గైలాసమేరురోహణ, శైలములకు మాఱు సేయఁ జాలరె వైశ్యుల్. 128

సీ. ఓర్చునాఁగలిఁ దూర్చి యొకకొంత యెత్తిన ఫణిరాజు తలగుట్టు బయలుపడదె
మొనయించి కులుగాడెములలోన వేసిన జమునిదంతకు వెన్ను సందువడదె
అద్దినేఁతకుఁ జొచ్చినపు డున్నదీవితోఁ జైయాలుదీవులు పైరు గావె
యాగిఁ జేయఁగినఁ బ్రోగైనపంటకు జగము లన్నియు గడఁ జాలుఁ గావె
దొయిదలనోపలు నలయఁ జోరరు గాకట్టు పేర్య, నేల యనుచుఁ దగిన నేలవలన
నన్నివస్తులు పొలఁగనిపించుఁ ద్రైలోక్యభద్రకరులు వీటిశూద్రవరులు. 129

చ. చిలుకకు మావికిం బగలు సేయకురే లతకూనలార వే
పలుకులు వచ్చునీఁద బలవంతుఁడు కంతుఁడు రేపు గుబ్బలై
కులుకక పోవు నేడలముకొన్న నునుంజనుఁబూప లంద్రుఁ బ్రే
మలముడి కాంద్రుఁ బండిపను మావిడితోఁపులఁ గాపుఁగాంతులన్. 130

గీ. పూవుఁ లంగళ్ళలోఁ జల్లపూటవీటఁ, జేడియలతోడ బేరంబు లాడునపుడు
తగులు విరిమాట తరితీపు ముగియనీక, జట్టి యొకమాలికకు నైన జాణలకును. 131

వ. ఎట్టులంటేని. 132

ఉ. నీవిరిపంద కేమి వెల నీసిగ కెంపులదండ దాపకుం
గోపమొ క్రేవయో యెమరుఁ గొల్వని యర్థము గోఁచఁ బాసిసం
క్రేవ ఘటింపఁ గన్నె విరికెంపులనింప పరస్మితప్రసూ

నా పలి క్రేన క్రేంకమధురాధర బింబశిఖాతటంబునన్. 133

క. ఎవ్వరికో యిరువురిలో, నెవ్వరికి నపేక్ష సేయ నితవగునన(గా
నివ్వని కింపులమాటల(, బువ్వులచే రెత్తినట్లు పుట్టుం బొంతన్. 134

గీ. తరుణి నీవు చూడ విరిదండదానవా, తగులుదండదాన వగుదుగాక
యనుచు జాణ గట్టు( గనునవ్వుదండ, యప్పువ్వులావి కట్టు( బువ్వుదండ. 135

ఉ. ఈవిరిదండ కొప్పి మణియిచ్చిన నీవిది యేమి యిచ్చెదం
బోవు( గదా బళీ తెలిసె( బో వెలిదండకు నేను నాటనా
పూవులపూవుబో(డి ముడిపూవుల దండలదాని( జేరరా
దా! వెలయాలనాయనను దద్విట లీలకు( బుష్పలావియున్. 136

వ. మఱి యన్నిదిక్కులం జొక్కులు గులుకు పలుకుల( జొక్కంబులై రొక్కంబుల ధిక్కరింప నవి యట్లుండె. 137

క. ఈ తీయతీ(గ నవ్వున, కీతనులత కెత్తునచ్చె యెత్తయ్యోనె నీ
చేతివిరిదండ యను యున, చేతోభవు పుష్పలావి చీరదె మరలన్. 138

ఉ. ఆనగరంబు గంధవహు( డంగడివీధులనాడుచుం గుంకు
సాని పిసాళిగందవొడి సన్నపు( గుంకుమపూవు(బో(చ లే
మేనియు( జొచ్చి యెత్తికొని యిచ్చకు వచ్చినత్రోవ( బోవ(గా
నౌనని పెట్టికట్టి యొక( డైన మరుం గిడ( డెంతముద్దొకో. 139

సీ. కొలుతురా చనువు గైకొన(గ( బుష్పాంకులార పదరేణువులపొంత( గుదురుకొను(డు
కలతురా సహవాస మలరు(దేనియలార వలిగుబ్బచెమటల( గలసికొను(డు
తగుదురా చెలిమి కుద్యానవాసనలార మేనితావుల నత్తమిల్లికొను(డు
అగుదురా తో(బుట్టు లళికుమారకులార కురులతో ముచ్చటల్గాడ(గికొను(డు
పోలు నని యేచి వాని నప్పొందుపట్ట(, దారసిలు( దళ్లుపై( జల్లు( దార్చు( గూర్చు(
జేడియల నాటకొండల నా(డునా(డు, మధురసాకూతసాకేతమారుతంబు. 140

సీ. పరువంపుమొగ్గలు విరియింప( బువ్వారు(దో(టకు( దుమ్మెపదా(టు( దేఱ
విరికి క్రేవ(గగు తేనె వెదలింప నేలని పుప్పొడి కనుజా(టుబూది చల్లి
వలపువసంతమై వలులువాడల నాడు వలపువీసరవోక నిలువ( గావ
నలుక మోములను వెచ్చులు రేచి కలయింప( గళి రే(గు పనులపై నల(త( దీర్ప
నల(తిగ్గైయై చూడ నల(తియై మెల(గుచుండు, సకలవీథుల వాకిలి శంబరారి
కేళిగలయును వాసనాప్రేరితాళి, నీరుశంబగు సాకేతమారుతంబు. 141

గీ. చెవరిపాలు నగులు షోపవిూఁదిప్పూవిల్లు, రత్న మడిన చివురు బత్తళికయును
జెలువు వేగుఁబోక వల్లెలని యూఅట, మసకొసాంతరముల నొకట వీట. 142

ఉ. నైపుణపేటికావివిధవాసన లుప్పతిలంగ లోనఁ బై
నాపవనప్రసూనరజ మంతటఁ గప్పికొనంగ నుండుఁబోఁ
బైపయిఁ దావిగట్టు వలిపంబున జొట్టిటుఁ బెట్టినాఁడు గా
నోపు జవాదికోఅయని యొప్పుకొనం దగుఁ బ్రోలు భూవరా. 143

క. వలదుపవనవాసనలం, గలవిపణుల మృగమదాదికము గమగములన్
వెలుపల లోపల వలపులు, గల నునుఁగప్పురపు బరణిగా కదిపురమా. 144

వ. అట్టి సొంపులకు బట్టైయున యప్పురంబున కధీశ్వరుం డతం. 145

సీ. వైవస్వతమనునాసావిభి నెవ్వాఁడు డిగ్గన వెలుఁగొందె డిగ్గ నుతికె
లోకలోచన మైనయాకాశమాణిక్య మెవ్వాఁడు గాంచె నింటిమొదలు
కిటికచ్ఛపగజాహిగిరు లేవు రెత్తిన నేల యెవ్వాఁడు వలకేలఁ బూనె
సత్యలోకాధీశనిత్యానుసంధేయు నిలువేల్పుగా నెవ్వఁడిలకుఁ దెచ్చెఁ
దండ్రి తుమ్ముఖలము తరణివంశమున ము, క్తాఫలంబు ధరణితపము ఫలము
ఫణిశయానుకృపను ఫలముతండి తద్వాకు, జనవిభుండు రాజచంద్రమౌళి. 146

ఉ. వేలుపు లౌనసం బుపవి వేలుపు లిచ్చలఁ బిచ్చలింప నే
వేలుపుఁగొల్వనెల్ల కలవేలుపు వేలుపురంగశాయి న
వ్వేలుపు బంతికి న్మొగము వేలుపుగా యని కోరికోల్చురా
వేలు పతండు వాల్చుఁ దోలు వేలుపుగొంగ యనంబ్ర సిద్ధుఁడై. 147

మ. అనిపల్కం జనమేజయుండు మునినాథా యెచ్చటం గెల్చె ఘో
రనిశాటప్రతతిం బితామహగృహార్చావిగ్రహంబైన రం
గనివాసిం దనయింటి కెట్లు కొనిరాఁ గాంచె నిత్వాకుఁ డ
జ్జననాథాగ్రణివార్తలఁ దెల్పుమన వైశంపాయనుం డిట్లనుణ. 148

సీ. భూనాథ విను జగత్పూజ్యసామ్రాజ్యంబు శతమఖభోగంబు నతిశయంబు
వెనుప వైవస్వతమనుకుమారుఁ డయోధ్య సుఖమున్న నారదసఖుఁడు వచ్చి
యతనిచే నర్చితుఁడై లోకవార్తలు కొన్ని వకాణించి మున్న నలువ
తపము సేతయుం రంగధామంబు ప్రత్యక్షమగుటయు నిలువేలుపుగ నొనర్చి
యతఁడు శ్రీరంగపూజల నాచరించు, క్రమముఁ జెప్పినఁ బరమభాగవతుఁ డాతఁ
డెవ్వటఁ దపమాచరింతు నే నెప్పుడు గాంతుఁ బద్మజాఁ దన గన్ననిధి యన్నఁ బర్వతుండు.

మ. పరమబ్రహ్మజ్ఞ సరస్సరిష్వనగిరు ప్రఖ్యాతము ల్వాసమే
నరనారాయణసంయమిప్రవర నానాపుణ్యగాథారమా
స్వర్గసజ్ఞాంకకీరవృద్ధ సురావాసప్రీతదివ్యర్షిభా
స్వరమా నాబదరీవనంబుకరణి న్వాక్రున్వరే దేనియున్. 150

సీ. ముని శిష్యసల్లాపమున నున్నఁ జెంగటఁ జంచరీకము ఝుంకరించువేళఁ
దపసులపై రంచుఁ దలపోలంబునఁ బోవు ఘోకము నీవరిచేసు మేయువేళ
వ్రతులు కాషాయవస్త్రము లారఁగట్టినఁ బ్లవగపోతము చెట్టు ప్రాఁకవేళ
మానులమణులువో దీననున్నవియంచు నంచ తామరకాయ చించువేళ
నేమనఁగవచ్చుఁ గొనిచూడ నెవ్వఁ డెఱుఁగు, నజభవాముల కైనసత్యాద్భుతంబు
బదరికాశ్రమవాస్తవ్యపారికాంక్షి, వివిధనియమోపచితతపోవిభవమహిమ. 151

సీ. ఆశ్రమస్థలరక్షకావరణంబుగాఁ గంపకోట ఘటించు గంధకరటి
యుటజాజిరంబుల నూబి పాఱఁగ గ్రొచ్చి యేటికి ద్దినివైచు నేకలంబు
మునికుమారులఁ దోడికొనిపోయి యడవిలోఁ బుట్టతేనియ త్రవ్విపెట్టు నెలుఁగు
పావముండ్లు చెలిపి తపోధనుల్చనుత్రోవ ఘంటాపథము సేయుఁ గాసరంబు
జపతపోమనుగాఢనిష్ఠలకును బ్రతి, బంధకము సేయు రాక్షసభటులమీఁద
నెవ్వుఁ గల్పించుకొనిపోయి గెలిచి వచ్చు, నచటికంఠీరవములు సంయముల్ప్రోల.

గీ. సంయమిక్రతుహుతేరసాశనము మఱఁగి, యగ్నిభట్టారకుఁడు నిచ్చలచట నుండ
నతనియొకిరింతయేడిక యనుదినంబుఁ, గొండగొఱియల బెదరించుచుండు బలిసి. 153

క. భారతవర్షప్రభు వగు, నారాయణు బదరికావనంబ కడ పయః
పారావారము ... ... ... గాఁగన్. 154

క. విచికిత్స లుడిగి చేసిన, నచటికృతము కోటిగుణిత మై ఫలియించు
న్వదియించితి నని పర్వతుఁ, డచిరద్యుతివోలె నరిగె నంత నతండున్. 155

ఉ. అప్పుడనప్పుడమి నూతకటారికోలలా
కొత్తులుఁ జిన్ననాఁ డరుల నోర్చిన సుద్దుల కాని దండురా
సత్తువలేని రాచముదుసళ్ళ నగళ్ళకడం గుమారకా
యత్తత నుండఁ బంచెను సమంచితనీతివిచారదక్షుఁడై. 156

క. , ధీనము సచివవ్రజంబుఁ దెఱఁగొప్పసుధా
ధీనము సుతశతము నయా, ధీనము గావించి నిజసతీసహితుండై. 157

వ. రథయానంబున.

సీ. పుణ్యసరోగణ్యభూములఁ బేర్కొనఁ జనుచు నొక్కెడ నొక్కవనమునందు
నొకసరస్తటమున నవిరతక్రియాకలాపములు నిర్వర్తించి సముపవిష్టుఁ
డై యుండఁగ వసిష్ఠుఁ డాగమించి సమాచరించుసపర్యలూరీకరించి
త్రిపదీగతత్రివేణీధర్మకలిత మష్టాక్షరమంత్రంబు హరిపరంబు
పిలిచి యోపలవలకేలు నిలువరించి, చదివె నాతని దక్షిణశ్రవణవీధి
నపుడు తచ్చిత్త మానంద మనుభవించె, నమ్మహాముని యంతర్హితి నధిగమించె. 158

వ. ఇవ్విధంబున నధిగతపరమార్థుండై యప్పార్థివోత్తముండు తనచిత్తంబున నెట్టికో
లు ఫలించెనకా తలంచి రథారూఢుండై చని కతిపయసరస్సరిదరణ్యగిరివరసము
త్తరణానంతరంబున నెదుర బదరీవనంబుం గని మునిశ్రావితలక్షణప్రత్యభిజ్ఞ నెఱిం
గి శతాంగావరోహణంబు దొరంగి కురంగీపురోగమనిర్దిష్టమార్గసులభప్రవేశంబును
చూతలపనసపారిజాతసరళసహకారాదిసాంద్రతామిహిరకిరణనిరాశంబును గ్రమజ
టాపటనపరాయణవటువినిక్షిప్తవిస్మృతసరస్తటసమిత్కుశగ్రహణనియుక్తప్రతూలి
తపాణియుగప్లవగపదపద్యాను ధావనవర్ణనీయపదవ్యాహవ్యసకాశంబును కుమా
రమరుదుపరిచంక్రమణసముచ్ఛలితసురభికుసుమగర్భీకరణావసర సమున్మిలితశిర
శ్రుతివనితాలంకృత కబరీభరవిశంకితహోమధూమనిరంతరాకాశంబును దదాగమవి
తర్కిత నిజతపశ్చరణనిశ్చయ పరస్పరవిజ్ఞాపనపరచతుర శారికావచననిర్దేశంబును
నభిమతగ్రంథసముపక్రమసమర్చనసమయసమాసీనగురుశిష్యపురఃప్రసవఫలనగ్నివనదే
తాకరకమలపూర్వోత్తరదక్షిణదృశ్యాదృశ్యతాజనితవికచస్వకీయవదనవిలోకితశుకనిక
రప్రపంచితకించిన్ముఖరవాసరేశంబును నగ్నిష్టోమాదిమహాధ్వరభాగభోగాభూతస
ర్వనిలింప సమాగతిజ్ఞాపకయాగశాలాబహిర్భాగభాగ్యరావణస్వాకృతభోజినీభూతకర
శీకరపిప్పలపలాశంబును దపఃప్రారంభ పరిణామప్రవర్ధనదశాంతరప్రసన్నపరా
దృష్టహరిహరబ్రహ్మసంవర్ణనసంక్రమప్రమోదితనమోంతనిగమాంతస్తవపాఠకబ్రహ్మరా
జర్షిపరిష్కృతప్రాగాదిదిగవకాశంబును నగుబదరికాశ్రమప్రదేశంబుం గనుంగొను
చుఁ దనయోపలఁగడలు తుదలు దోఁచని తత్తదతిశయంబులవాఙ్మానస గోచర
త నూచింపనిలింపస్వాంతపంతావళాలానంబగు నారాయణస్థానంబు సొచ్చి య
చ్చోట సంక్షోభవించిన విరించసము లగుసంయములం గమలాక్షీసమేతుం డై సేవిం
చి దీవించిసంభావించిసం బోధలి తదీయపరమోపకారంబున నుచితప్రకారంబుగా
దగ్గఱి యగ్గరుడధ్వజు భజించి నిజరాజధానికి సపరిజనకథంబుగా రథం బనిచి
యందు. 159

క. దినముఁ గనువిందు సేయఁగ, మునిగృహముల వన్యభోజ్యములఁ దృప్తుఁడై
మనుతఁడయ్యుండె నంత నయం, బునకుం బనుపఱచి దేహముం దైవమతిన్. 160

క. సతిపరిచరింప విమలవ్రతుఁడై గురుఁ డగువసిష్ఠవాచంయముఁ డా
గ్రతపంబుఁ జేసి యుత్కృష్టతవడసిన మంత్ర మచట జపియించె వెసన్. 161

చ. అడుగున నంగుటంబు నఖరాగ్రము మేదిని మోపి మోవిలో
నడిచెడు మూఁడుమాటల మనుప్రవరంబున ధర్మమైన య
య్యొడయుని వెంకిమీఁదఁ బొడవుప్పఁగఁ బుట్టలువోసె భామముం
బడమటికొండపై నిలుచుపాటికి బైట శిరంబు దార్కొనన్. 162

చ. ఒఱగక యిట్లు పాదనఖ మూఁది జడల్వెడ జాఱి మాళిపై
గిరిగొనితోఁచఁగా ముకుపుఁగేలఁ దపం బొనరించె భూవరుం
డెఱిఁగి యొఱింగి యెప్డు దనయేలెడునాట నధర్మమట్లుగాఁ
బఱచినపాటు కట్టి కుడుపం జనునో చనదో విధాతకున్. 163

సీ. క్రాఁగిన వినువీథివేఁగి డిగ్గిన గాడ్పు ధరఁ ద్రొక్కి దిద్దిరఁ దిరుగ నెగయ
వ్రేగు వ్రేసినచోట వెడలిన శేషరత్నప్రభ గోత్రభిద్ధనువు మెఱప
వెచ్చనియిలు వేఁడి వెలుఁ గనుడియాస లుడిగి లోకము మూచ్చనుడిగి వడఁక
వలపు దుమ్మై వియోగుల యేపు లుడివోయి యలరు పుప్పొడులు చేఁటఁబడఁగ
మిడియ నెండ గాయ జడివాన గురియఁగ, సీతుగదుర వృక్షజాతు లలర
నగ్నిలోన బయల నప్పుల నప్పుగో గణముఁ బ్రోలఁ జేసెఁ గడిదితపము. 164

చ. అతఁడు తపంబు సేయఁగ భయంపడి యింద్రుఁడు దివ్యభామలం
బ్రతిమఘమాసముం బనుచుఁ బంచిన వా రరుదెంచి తత్తపః
ప్రతిభకు దృష్టిదోషములు వాయఁగఁ గమ్మని లేఁత నవ్వులం
జతురకటాక్షచంద్రికలఁ జల్లుదు రింతియ మాటిమాటికిన్. 165

గీ. కడఁగి యపుడ కాదె కర్పూర తిలకకుఁ, బిలిచి ప్రియముఁ జెప్పె భిదురపాణి
పంతమాడెఁ జూవె బలభేదికొలువున, నదియునంతరాయ మాచరింప 166

వ. అమ్మందగమన కిందుకందర్పమాథ పమందమారుతంబులు సహాయులుగాఁ బ్రార్థించి
కొంత మంతనంబుఁ దలపెట్టి. 167

సీ. పగలు వెన్నెల గాయఁ దగవు గా దనకుమీ యింతి నవ్వుల వెంట నింతుగాని
యలయించువిలుగాని యలవడ దనకుమీ తొయ్యలి బొమతోడఁ దొడుదుగాని
బయటఁ బూవులు పన్న బాడిగా దనకుమీ యింతినవ్వుల వెంటనింతుఁగాని

మలయంబుపైఁ గాని వలనుగా వసకుమీ వనితగుబ్బలు సోఁకి వచ్చు గాని
రాచతఱిసి మీఁద నేసి యాకరిప్పగ, తిలక విలసనంబు గులుకుసఖుడవు
చంద్ర కుసుమశర వసంత మందసమీర, యనుచు నెచ్చరించి యనిచె వల్జి. 168

క. హిమరుచి కస్తురి పుష్పాకర, కుసుమరగంధవహులపుడు కోమలి లీలా
సమగ సమద నిశితకటా, క్షములను నాసీగఘటులు గాఁపుగ కలిగెన్. 169

వ. ఆచ్ఛాలలో హేమాములు కొంపలు కామాదులముందే దగుటపుం వగం గలుం
దనుఁదడింప. 170

క. అచ్చెలువ మగువ మగతెగ, నెచ్చెలి జత దోయితోఁజని లతాసనికి
న్వచ్చి పని ద్రిప్పెగామని, ముచ్చెచ్చమునఁ దపుడు రాజముని గనఁబడిగెన్. 171

వ. మ్రొక్కియచ్చేడియనుం జూపిననదియు.

ఉ. అంబుధియల్లుపట్టి మన యచ్చరజాతికి బానవేల్పు. శ్రీ
తాంబరుఁ డెట్టు లట్టి హృపయంబున కెక్కె సితం పటంచు దూ
రంబునఁ జాఁగి మ్రొక్కె ముని రాజున కోడిశిఁ బొమ్మటంచు గ
ర్వం బతి వచ్చి కంతుఁ డటువైచిన వాసవకైదువో యనన్. 172

క. అటులు ప్రణమిల్లి దివిషత్కుటి లాలక రాచ తపసి కొమరుఁగని బాలా
జటులా వీరికిఁ దాలిమిఁ, జిటిలిచి యేనెప్పడొక్క సిగ ప్రేయింతున్. 183

మాలిని—అనుచు నతని మ్రోలన్, హావ భావాదిలీలన్.
జెనకొక మకరాంకుం జేయు తీయంబు చిల్కన్.
దనస ఖులును దానుం దమ్మి నెమ్మోము తావిం
దనిసి కొవమతేటుల్ తందనాలు గ్గడింపన్. 174

వ. వనవి నోదంబున కుంజొచ్చి విచ్చలవిడి విహరించున వసరంబున. 175

సీ. బెలకుల క్రొవ్వాడి వలచి వచ్చు కటాక్ష మలతి పొన్నల పొలు పార్చియార్చి
చలువతోఁ దియ్యంబు సగపాలుకలసిన పలుకునకొక మొగ్గ విలిచి విలిచి
మోఁపులొయ్యనసాన నోలవాడెడునడ నెమ్మిబోదులపాల నెరపి నెరపి
తళుకుల నెత్తావి కులికిపోసినగుబ్బ లెలగాడ్పులకు నెఱక్కలిపి కొలిపి
చిగురు చిదుమఁబోయి చిన్నారిపొన్నారి, మించుముద్దుఁ జక్కడించిడించి
యింతనంతఁ బొలసె నెలనాగ యొమ్మెటి, మదివిరాళిపెనుప నపను వేఁచి. 176

క. మరదితిగా మునువలఁగొన, కెఱగితిసని మరలవచ్చి యెలనాగమునిం
జెఱుకువిలుకాడు వాడిన. మెఱుగుంబోఁగనఁగఁ జొచ్చె మెయి జిగి నిగుడన్. 177

వ. అయ్యవసరంబున. 178

క. కసరి పొసరిల్లు వెదలఁగ, నొసలొక తలిరాకు దాఁకె నునుగాడ్పునకుఁ
భసలగుణ మెక్కు వెట్టఁగఁ, గుసుమశరాసనుని విల్లు కుసుమకువితిగన్. 179

క. అందున వెఱగందియునా, కందర్పుఁడు నవమ్యుణాలగదయనఁగా గు
ర్వింద విరి సురియయఁగాఁ, జెందిరతూపనఁగ జిగురుఁ జేయమ్మనగన్. 180

క. గొబ్బున గొబ్బునఁ జేసికి, నబ్బిన కైదువులఁ జేసికి యాడిన చెనకుల్
జబ్బునఁదుఁగాని యేమిటి, మబ్బొరయావ ముని మనస్సమాధి జ్యోత్స్నన్ 181

క. సోముని వెన్నెలతోఁపులు, నాముని క్రొవ్విరులుఁ బూజలట్లైయుండెం
గా ముని పసలాముని దెస, భూమిని హరిభక్తు లఖిలపూజ్యులు కారే. 182

చ. మనుతనయుండు నంతట సమాధి సమాపన వేళ నైన లో
చనములు విప్పి ముందటఁ బ్రసన్న పరిస్ఫుట బింబ మొప్పని
ల్చిన నెల నిల్వుటద్దము వలెన్ మెఱయంగ మరుండు మాధవుం
డును ననుగాడ్పు మేనులకు నోఁచఁగ నచ్చెరలాటలాడఁగన్. 183

వ. నిరీక్షించి భయంబునం జనుదెంచి. 184

సీ. గళితచ స్వేదాంబురత పదాంబుజుఁ డైన పంచబాణుని కేల పాద్యమనఁగ
విరహిణి కన్నీటఁ గరములు కడిగినా, దమృతదీధితి కేల యర్ఘ్యమనఁగ
కదిసులే పేనోటఁ గాలూపఁ జలి గాడ్పు దొర కేలకుఁ బరిస్తరణమనఁగ
గమ్మని పూవెల్లఁ దుమ్మెదకని పెట్టుఁ బుష్పాకరుని కేల పూజయనఁగ
సిగ్గుపడి నాఁడు చిత్తంబు చెఱుపఁబోయి, యచ్చరలకేల కుశలంబు లడుగుటనఁగ
జేసి నాతిథ్యములు తొల్లి మోసులెత్త, నట్టితయకాపరాధుల కత్తపస్వి. 185

వ. అప్పుడప్పుష్పకోదండాదు లొండొరుల మొగంబులు చూచికొనుచుఁ దమలోన. 186

క. తలఁకరి తలలూఁచిరి వెల, వెలఁబారిరి వెఱఁగుపడిరి వేడుక పడిరీ
నిలుకడ యీతాలిమి యీ, గెలు సంబద్ధి యోరికింగలవనుచున్. 187

వ. అంతనుం గందర్పుండాచందంబు దెంపంబున పలపోసి. 188

చ. కలువలవిందు నక్కమును, గమ్మకొలంకుల గాడ్పు క్రుంకు చె
ల్వలజపలుకఁ వసంతువనవాసము క్రొవ్విరి కత్తికోతలున్
వెలలి నాడు మాధుకరపృష్టి విశిష్ట గుణంబు నెంచియో
చెలిమియుఁ బ్రేమయుం బొదలఁ జేసె మహాముని యాతిథేయముల్. 189

గీ. మరులు దోఁ పెంపొందె మాచేయదనుతెల్ల, నిట్లు వట్టివగుచు నెట్టనడిగ
గాన యెదపట మమ్ముఁ గైకొని మాపినా, దట్టిగంత తపస్వి నుతిగ పూజ. 190

వ. అని తనమ్రోల బ్రాంజలియైయున్న రాజర్షి నాలోకించి. 191

గీ. నను జయించితి వేలయ్య మనుకుమార, యిఱుఁగెఱుంగ జగంబెల్ల నెఱుఁగునన్ను
నెవ్వరేమిగారు నాయెటుదాఁకి, యమ్మనీబుద్ధికెదురెక్కుడయ్యెఁగాక. 192

క. అనిమిషరాజాదులునా, నా వింటికి మారుమలసినారా హరుఁడున్
నను జిక్కులువెట్టియునా, కొనకూతనవోడిపోయె గ్రోధంబునకున్. 193

ఉ. ఎన్నటిమాట నీ వెఱుఁగుదే తుహినాచలమాటఁ మేనకం
గన్నులఁ జూపి యంపసెసఁ గ్రాచిన కాకకుఁ జల్లఁజల్లదా
రొక్కన్న విరాళినాఁటి వలిగొజ్జఁగి నీట జుమయ్య ధాత్రికిం
బన్నిన కొండకొండ యొకపాటునఁ దాల్చెఁ బపంక మిప్పుడున్. 194

ఉ. పుట్టుము ఘోతరాసు లిటు వుట్టఁగఁజేయుట కెత్తికొన్నఁదో
బుట్టువు పూన్కియాడు మగపుట్టువు లన్నిట బందుకట్టి యే
పెట్టినచిక్కు గాదె గలిపించె ప్రసూనశరంబు పంచి కొ
న్నట్టి పనుల్ వరించు నుభయాత్మకమైన ప్రపంచమంతయున్. 195

క. తూలక తులిచెంబననునిఁ, జేలక తేలించెజలధిఁ ద్రిప్రాఁలునిం
డ్రేలక వ్రేలిచె నీమొదఁ, జాలక చాలించెఁ బ్రసవశర మాకడెకల్, 196

పంచచామరము—అభీష్టసిద్ధినీకగున్ మహాత్మ పోయివత్తుమా
ప్రభుండు వజ్రపాణిమమ్ముఁ బంచె నివ్విశేషముల్
లభించెనంచుఁ బల్కి యబ్బలంబు వెంటరాఁ గుభృ
ద్భేదిపాలికేగి చెప్పె విప్పివిప్పియంతయున్. 197

సీ. మసమసకలువాఱు ముసలికన్నులు విచ్చి నేలసేర్పరయంగ నిలువఁబడుచు
నూఁతకోల కెలంకులరయ ముందటనార్చి కడకుఁ జంకులు ద్రోచియడుగులిడుచు
బలుచప్పడెద్దియే నలతిస్లై యేతేరఁ దనమంచి చెవియొగ్గి పవుల వినుచు
గద్గదస్వరము బిక్కయెలుంగు తోఁగా దసెలఁగహరిస్తుతుల్ చేసికొనుచు
వచ్చి ప్రాబారుఁడొకఁ డిచ్చపాణిసాచి, తడవి నీవెవ్వరన్న నేత్రములు మాకు
మిగుల నొప్పవురాజర్షి వగుటదోఁచెఁ దపముబహువిఘ్నమీవెట్లుదాల్చితనని, 198

గీ. దర్పణంబులేకతనమోముగనరాదు, దానసైన వెన్నగానరాదు
కన్నులొప్ప నెంతొసనమోఁప్రుఁ జెప్పుడా, యెఱుకచూపకాంచునెల్లయవియు. 199

వ. అనియట్లుండె. 200

సీ. హస్తమస్తక సంయోగమాచరించి, తెన్ని విఘ్నంబులును నన్నేమి సేయు
నయ్య తరియింతునన నవ్వి యతనికతఁడు, గరుడవాహనుఁడై పొడకట్టిపోయె. 201
దోధకం—పోయినఁ బోఁడొకపుణ్యముతోరా, బోయినవాఁడజపూజితరంగ
శ్రీయుతఁ జేదయ సేయుశుభాభి, ప్రాయము దేయని పార్థివుఁడంతన్. 202
క. గనితలపోయుచు నెప్పటి, మనమునఁ దదపేక్షఁ జేసి మనునందనుఁడున్
ఘనతనిష్ఠుండై మునిచె, ప్పినమనురాజంబు మదిజపించుచు గడఁకన్. 203
వ. అనిన విని జనమేజయుండిట్లనియె. 204
క. అయ్యా పంతంబాడిన, యయ్యబ్జయేమి చేసె నమరేశ్వరుఁడుం
గయ్యాలగఁడసు తుది నే, మయ్యెం జెపు మన్న నతని కతఁడిట్లనియెన్. 205
క. వంచినతలయెత్తుట మాన, సించక కర్పూరతిలక యింటికిఁ బోయెన్
బంచశరవచనములఁ గలు, షించి సునాసీరుఁ డమ్మునిమ్మువచ్చెన్. 206
ఉ. వచ్చిన సర్వదేవగణ వల్లభు నభ్రగజాధిరూఢుఁ ద
న్మెచ్చక యత్తపోవని సమీపగతుండయినట్టివానిఁ గ
న్విచ్చి గురించి చూచె నలవిష్ణుపరాయణుఁ డిష్టపూజ లే
నిచ్చెద నంచుఁ దాఁ గులిశమెత్తి మహేంద్రుఁడు వైచె వైచినన్. 207
ఉ. అంచులు నూట నుగ్ర నిబిడానలకీలలు గ్రక్కుకొంచు నే
తెంచు రయంబు చూచి పరతెమ్మిఁక నెన్నఁడు విష్ణుచక్రమా
యంచు నతండు భక్తినతుఁడై నగుచుండఁగఁ దత్క్షణంబ వే
యంచులకైదు వడ్డపడి యార్చిపవింబడఁ గొట్టె గొట్టినన్. 208
క. నిగ్గుపడి నిడుప బుడిప్రలఁ, బొగ్గుపలెంబడిన వజ్రముంగని సురరా
జగ్గణములతోఁ దనధృతి, యుగ్గునడన్ వేఁ బితామహునికడ కరిఁగెన్. 209
చ. అరిఁగి పయోరుహాసను పదాంబురుహంబులఁ బ్రాలి తప్తపో
గరిమము పేరు చెప్పి తనకగ్గిన కైదువుసూపి యద్ధరా
వరునయిఁ బోయి వజ్రమును వమ్మయి దీప్తిఁదొఱంగె దేవ నీ
వరమున నేమొ కాక యిఁక వచ్చునె యూది వెలుంగఁ జేయఁగన్. 210
క. అని మఱియు మఱియు, నడుగగ, వినిలోకపితామహుండు వెఱఁగంది మనం
బున భగవద్భాగవతుల, యనుపమ శక్తులకు మ్రొక్కి యతనిం బలికెన్. 211
ఉ. అప్పటి వేఁడి నార్చె నది యంతియె వైష్ణవ సాధనంబు నీ
వప్పున నీనివేఁడి కడి మప్పున తెప్పినఁ దప్పనిష్టనే

యిప్పటికంచుఁ దెల్పి తపమేమిటికిఁకోయని యోగదృష్టిఁ దా
నప్పుడు గాంచి రంగనిల యా! యెటువోయెదయంచు మూర్ఛిలెన్. 212

క. కప్పుడిగి వెలిగెఁ గులిశం, బప్పెనుదొర దీనివేఁడికది దప్పనె య
న్నప్పూప యది యట్లుండెం, గుప్పలిలన్ మూర్ఛ కెట్లొకో యన నజుఁడున్. 213

గీ. ఒయ్యఁ దెలిసి యొద్దనున్న యింద్రాదులు, దానునపుడు రంగధామమున్న
తావు సేరఁబోవుటయుఁ గటాక్షించె శ్రీ, రంగశాయియాదరమునఁ బలికె. 214

సీ. అనఘ నీకుఁ బ్రసన్నుఁడన చింతయేల యేనాది సంకల్పించి నదియ వినుము.
తొలుత నీచేనర్చితుఁడ నింక సాకేతమున కేఁగి యిక్ష్వాకుముఖులచేత
యుగచతుష్టయ నిరతోపాసితుఁడనౌదు నట మీఁదసప్తమన్వంతరములు
గా వేరినడుగడ్డఁ గాపురంబుండుదు దివసాంతమున నిటఁ దిరిగి వత్తు.
నీవిమానమునన యాజ్ఞగ్రహముకోన, జోకపరతు రాకపోకలనిన
ధాతకపలె రంగధామంబు ఖగరాజు, నంసమెక్కి రాఁగ నంచనెక్కి. 215

చ. కమలజుఁ డిమ్మెయింగపలఁగా మఘవాదులు రా బురస్సర
త్తుముల మరుచ్చమూముఖర దుందుభినాదము భూనభోంతరా
ళముఁ జెలగింప నచ్చరల లాస్యముఁ జూచుచు రంగధామదై
వము బవరీవనంబునకు వచ్చె జగంబులకద్భుతంబుగన్. 216

వనమయూరం— అత్తరినిదివ్యమురజావళుల ధింధిం ధిత్తిమికిఁ జిత్తములు దేలనలన్యత్తా.
యత్తమగు మెచ్చునకు నచ్చెలతోడన్, బొత్తుగలపెన్ నృపతపోవనమయూరుల్

ఉ. ముచ్చటనంతసేపు తనముందలికి నా ఖగరాజు నెక్కి యా
యచ్చరలాడఁగాఁ గమలజాదులు గొల్వఁగ రంగధామమున్
వచ్చిన గా దలంచి మనునందనుఁ డప్పుడు కన్నువిచ్చి తా
నచ్చెరువొంది చూచి నిజమేయని తాండవమాడె వేడ్కన్. 218

గీ. తాండవానంతరమున మార్తాండపౌత్రుఁ
డూర్ధ్వబాహుండై హరిఁజూచు ముందు చొప్పె.
పుటము లెగయుచు నాసంపపురము మీఁది
నిలుకచూపఁగ నిలచిన నెలవనంగ. 219

క. లోఁగూర్చి యతఁడు పిలిచిన, రాగిలిగినసంతసంబు రంగేశ్వరుడుం
దాఁగోరినట్లు దైవము, రాఁగాంచిన సంతసంబు రాజుం గాంచెన్. 220

చ. నరరుచుఁ జూచి యప్పుడమునందనుఁ డానందపగు ముఖ్యనాసుఁ

డొక్కఁ గాంచెమువెంబడిసీమఁ దన కల్గినదాపుర మీశ్వరుఁడు శా
హిరముగఁ జేసెఁ జూచుమిది యిల్లది విగ్రహమేము నిత్యకిం
కరులమనంగఁ దత్పురుషకారమునం దగఁ జేరి సన్నిధిన్. 221

## మధురగతి రగడ.

జయ జయ యీశ్వర సకలప్రేరక, భయహర చిద్రూపలతాకోరక
అనుకంపామణిహార మనోహర, యనుదివసపరమహంసమనోహర
దీన ప్రీణన దీక్షాధారక, నానాబ్రహ్మాండ సముద్ధారక
దామోదర నీతామరపాక్కిలి యెల్లనలువలకు నిమ్మది మిక్కిలి
జగములకును నీచల్లని యడుగులు బగలును రేయును బట్టిన గొడుగులు
శరణాగతరక్షక నీసన్నిధి యిరవుకొనియెనే యీపంచాయుధి
పడగగొడుగు హరి పరపగు గంతులు, కడఁగికనిరి యీగరుడానంతులు
సముఖంబిచ్చెనె జయవిజయస్థితి, సుముఖుండయ్యెనె సూత్రవతీపతి
ననుమన్నించిరి నందసునందులు, చనవిచ్చిరి మాసనకసనందులు
మునుపఁ జదువులకు మొదలౌ యీయిలు, కుదురై తుదినీకోడలురాజిలు
దేటపడియెనే దివి యిందొక యెడఁ, గోట బలిసెనేకుతలంబొకకడఁ
గొలిచినిలచినవి కొండలబారులు, ఘుళఘుళరవముల గదలెడు నేరులు
మాటల మఱిగిరి మనువులు వసువులు, దాటెను దుర్గ్రహ తతిశశివసువులు
కబురువడసి రేకాదశరుద్రులు, తపసులు పన్నిద్దరు నిర్నిద్రులు
వేలుపడరు తోలువేల్పులువేల్పులు, దూఱిరి మధురగతుల జడదాల్పులు
గాంచిరి దుర్గాగణపతులింబుల, జూచితినింద విశుద్ధజగంబుల
నీవే తానో నీశ్రీరంగము, సేవించెద జేజేజయరంగము. 222

గీ. అనుచు నగ్గించి మాటకు దనరనజ్ఞ, పలఁతిరై కోర్కెలీనఁగ ఫలము వడయ
నలువలంకుల దండప్రమాణరచన, విలసిలఁ బ్రదక్షిణ చతుష్కవిధులు సలిపి 223

చ. మఱియు ననేక వందన సమర్పణ మొప్ప ముకుంద యెద్దిరా
నుఱఁ దనకొప్పమంచు సమయోచిత పూజలఁ దేల్చి పిల్చి యా
య్యాఱమర లేనిబంటు దలపారసి చిప్పన వచ్చి వాళిపై
నెఱఁగినరంగధామము వహించె శిరోమణివిభ్రమంబుగన్. 224

వ. అనవిని జనమేజయుండవ్వలి కథాక్రమంబెట్టిదనిన. 225

## ఆశ్వాసాంతపద్యములు.

శా. అంభోరాశిగభీర భీరహిత బాహాధారధారాళవా
గ్గాంభీర్యప్రతిభాపితా మహామహాగంధాసుహృద్భూమిభృ
జ్జంభారాతి కృపాణపాణవరవస్వాహావిధూనాధ సం
రంభభ్రామ్యదరాతిపట్టనవన వ్రాతాంతరోద్యద్యశా. 226

క. వారాశిముద్రితాఖిల, భూరాజ్య రమారమణ నభోమణి వంశాం
భోరాశి హిమానీకర, నారాయణచరణనలిన నమ్రమనిటాలా. 227

స్రగ్విణి—విద్యుదుద్వేల్లదుద్వేతుణానందనా, సద్వచస్సన్నుత స్వచ్ఛకీర్తిచ్ఛటా
హృష్టవచఃకాయకర్మేందిరాప్తప్రియా, విద్విషద్వాహినీవింధ్యకుంభోద్భవా.



ఇది...శ్రీమత్తిరుమల తోళప్పాచార్య చరణసరసీరుహ సేవాసమాలబ్ధ సామ్రాజ్యధౌరే
య నిజకావ్యాభరణాయమాన యెల్లభూపురందరనరనందన మట్లనంతభూపాల
ప్రణీతంబైన కకుత్ స్థవిజయంబను మహాప్రబంధమునం బ్రథమాశ్వాసము.

శ్రీరస్తు.

# కకుత్స్థవిజయము.

## ద్వితీయాశ్వాసము.



క. శ్రీమన్మణివంశరాజన, భోమణినిబిడౌజ యెల్లభూమిబిడౌజా
రామామదనా శత్రు, గ్రామాభీలా విభాళిగండరబాలా. 1

వ. అవధరింపుము మనునందనకథాసుధాధారాధౌతమానసామేయ జయుండగు జనమే
జయునకు శంపాయనుండగు వైశంపాయనుండిట్లనియె. నత్తెఱంగున. 2

క. పులుగు దొర నివ్వాగుతోఁ, దలయూఁచఁగఁ గదలి దివ్యధామంబుఁ దలం
జులుకందాలిచి వినయాం, జలితో బ్రహ్మాదులకును జనవిభుఁడనియెన్. 3

ఉ. ఇంటికినిల్లుగట్టికొని, యేలఁగవచ్చు మురారి వెంటనా
యింటికి వచ్చి పూజగొనియేగుట నన్నుఁగృతార్థుఁ జేతయా
గంటిరె యంచు సమ్మతిలఁగాఁ గొనియాడిపితామహుండు ము
క్కంటియు నింద్రుఁడున్ మొదలుగాగల యందరు రాముపంబునన్. 4

శా. శ్రీమద్రంగవిమానమానిత శిరశ్శృంగారుఁడా రాజయో
ధ్యామార్గంబున వచ్చె దుందుభి మృదంగారావముంగాహళ
గ్రామారావము దిక్కుడుంగ జనితారావంబు సేవింప రం
డో ముందోడక వచ్చెరంగపతి యం, చుద్దండమై ప్రేమఁగన్. 5

వ. ఇత్తెఱంగునం జనుదేరఁ గుమారసామంత పురోహిత వరూథకరియోధజవన తుఖా
ర వీరభట పౌరనట విలాసినీ సమభియానంబు వివిధతూర్యముఖరాయమాణంబ
య్యె నయ్యెడ రంగేశ్వరుండు. 6

క. నరనాయకుఁ డరదము గాఁ, బురప్రవేశంబు నడపి భూరివిభూతిం
దిరువీథులు వేంచేసిన, పరమోత్సవమపుడు భువనపాలురఁ దేల్చెన్. 7

వ. అనంతరంబున. 8

సీ. అహిరాజశయన చిత్తానుసారంబున మనుతనూసంభవు మనవిమీఁద
నంభోరుహాసను నాజ్ఞావశంబున బృందారక ప్రభుప్రేరణమున
సరయూసరిద్వరోత్తర తటాంతికమున దమసామహానదీదక్షిణమున

బ్రహ్మస్థలధి వసింపఁగఁ గోరుకొనునోట వీఁటికోటకుఁ గూతవేటు మేర
రత్నమయముగఁ బ్రాసాదరంగమంట, భోగమంటపప్రాకారగోపురాది
విభవములతో నయోధ్యకు నభిముఖముగ, విరివినగరు వినిర్మించె విశ్వకర్మ. 9

క. వేలుపు వడ్రఁగి వెట్టిన, కీలునఁ బలుకాటమాటక్రియగ నుపట్టుం
గాలోచితముగఁ దద్ది, వ్యాలయరత్నప్రతిమలకనురూపముగన్. 10

వ. మఱియు నయ్యమరశిల్పాచార్యుండు. 11

సీ. ఒకప్రదక్షిణవిధి నుపచారదీక్షితబ్రహ్మసౌధంబులు ప్రస్తుతించి
యొకప్రదక్షిణవిధి నుత్థితవ్యవధానవిపణిహర్మ్యావళి విస్తరించి
యొకప్రదక్షిణవిధి నుభయనాట్యంబుల మేళంబులకుఁ జంద్రశాలలునిచి
యొకప్రదక్షిణవిధి నుత్సవాగత లోకపతులకుఁ బ్రాసాద వితతినిలపి
కీలుతెరలును గీలు గుజ్జాలు కీలు, వేసుకులఁ గీలుటంచులు హేమరత్న
కీలితానయవములుగా గీలుగొలిపె। గీలుకీలునఁ జైతన్యలీల లెసఁగ. 12

వ. అనంతరంబు యంబుజాసనాది నానాదివిజ వరిష్ఠ వశిష్ఠప్రముఖ మునిసమ్మతంబుగా మనుతనయుండు తద్దివ్యాగారంబునందు. 13

క. శుభతిథి శుభవారంబున, శుభయోగమునం బ్రశస్త శుభకరణమునన్
శుభతారన్ శుభహోరన్, శుభకరు శ్రీరంగవిభుని శుభమతినిలిపెన్. 14

స్రగ్ధర—ఉంచె న్నానానియోగార్హ్యులు శుభనటనకళాయుక్తిమై గొల్చియుండన్
బంచెన్ లావణ్యధన్యప్రమదలఁ బ్రజలం బల్వురం గూర్చియుండన్
నించెం బ్రోల్గాఁగఁ దాదృగ్నిజపుర మొక మన్నినిపాలెంబు బోలన్
బెంచెం దద్రంగధామప్రియవిభవములం బ్రీతులై వేల్పు లెంచన్ 15

క. బలియుఁగ మద్దెలతాళము, సెలఁగగ నావజము మొరయ సేవావేళం
గొలఁకుల భోగుల - మ్మేళ, కోలకోలమును క్రందు గ్రిందు కోవెలయందున్. 16

గీ. ఇత్తెరంగున నమ్మాన వేఁగురుండు, దివ్యభోగాభివృద్ధిసంధిల్లఁ జేయ
రంగమందిర ఫణిలోక రాజరాయి యచటనిత్యసుఖావాసమాదరించె. 17

వారిచేతనను జ్ఞాతులు, వారినమ్మునబలముచేత న[illegible]తులునునై
[illegible] ప్రముఖ జగ, [illegible]ధులపుడరిగిరాత్మపట్టనములకున్. 18
నన్యులైరనక నయ్యజశంకరు లపు [illegible]
[illegible] లైన వేలుపుల లో[illegible] [illegible]తెలునై
[illegible] బసలెట్టు[illegible] [illegible] సుదుర[illegible]డఁ దత్తదీయులన్

నరపతినిల్చె దండితిరునాళ్ళకు వారలువచ్చియుంటకున్. 19

చ. కలవు బిడారులందు నవఖండమహీశుల కంఠిరీపరా
జులకజముఖ్యదివ్యులకుఁ జుట్టలకాప్తుల కన్నియుండ్లునుం
గలకలనవ్వరా బవనికల్ గదరాయివి రత్నకుట్టిమ
స్థలముల నంటిపుట్టినన సంతనగా నవరత్నజాతులన్. 20

వ. ఇవ్విధంబున మనునందనుండు వివిధసంపత్కళానిగళనిబద్ధసకల జనహృదయసా
రంగంబగు శ్రీరంగంబున నుభయవిభూతిసుఖంబులనుభవించి విరించిప్రముఖులు
నంతరీపభూపాలురు నిజనివాసంబులకుంజనిన పిదపం బదపంకజవాస్తవ్యదివ్యముని మ
నోభృంగతతియగు రంగపతికిం గైంకర్యపరుండునుం బరిపాలిత రాజ్యభరుండును
నై మంత్రిపురోహిత పుత్రమిత్రాది సమేతంబుగా సాకేతంబున సుఖంబుండె.

మ. నవవర్గక్షితిపాల ఫాలముల విన్యస్తమ్ములై యాకటా
క్షవిలోకంబుఁ గరాంజలుల్ దనయ నిక్ష్వాకుక్షమాభర్త వా
సవతేజంబువెలంగ నుజ్జ్వలసుధాసౌధంబునం జాట్కికి
ట్టవు నానెప్పటి కొల్వువేళ మణిపీఠాసీనుఁడై యుండఁగన్. 22

సీ. సిరసున నొకచాయ జిలుగు రుమాలులో జీరణంబొక చెంపఁ జిక్కఁజెక్కి
చికిలి నిగ్గులు చిమ్ము చిన్నారి క్రొవ్వాఁడి చేబాకిద భూజాగ్రసీమఁ జేర్చి
పసిడికట్టులఁ బొల్చు పవడంపుఁబిడికోడి యులిదట్టిపార వెంట మొలనమర్చి
పదను దప్పక లోహ పాషాణములబట్టు చిత్రికపల్లుండా చేత, బూని
నిగనిగని కెంపుముక్కును నీలనయన, కాంతులును బచ్చరెక్కలకైపుగల్గు
కృతకకీరంబు పలకేల నతిశయిల్ల, వచ్చె వఙ్గంగి యొకడు భూవరునికడకు. 23

మత్తకోకిల—వచ్చియెమ్మెయిఁ గేలుఁదించిన వానిచేతి విచిత్రపుం
బచ్చవిల్తుని తేజి భూపతిబాహుశాఖప్రవాలివా
గ్రచ్చి యంగదపద్మరాగముఁ గ్రోలఁబోయిన మేలు మే
లచ్చపల్కుఫలభ్రమంబున నల్లకాయని రెల్లరున్. 24

గీ. అపుడు రాజుకటాక్షించి, యతనిఁబిలచి యెద్దినీరాక వాంఛితం బెట్టిదనిన.
నిక్క వేలుపుఁగొంత యింకొక్కకాను, కీపు గైకోలునాకునభీష్టమీఁగి.

వ. అనినోరనుడుచఁదడన. 25

క. మొఋఁగులగుంపై యురుములఁ, జెరగొని మేఘునకుఁ బాసిచేరనిచటికి
త్తజీవన హయ ఘోషలతో, మెఱయుచు నొకదివ్యరథము మేదినిఁ వ్రాలెన్. 26

గీ. వ్రాలికొలువు మేడమ్రోలశోభిల్లుచు, నరదమునికి సూచియతనిఁ జూచి
దివ్యశిల్పియొక దే యితఁడనిరాజు, సభయుసంశయించి సంభ్రమింప. 27

వ. అతండు నగుచు నట్ల యగుటం జేసి నిజాకారంబుదాల్చి తనకుం బుడమిరెండుగా
వించు ప్రత్యుద్ధానాదులు గైకొని యభ్యర్చితుండయ్యె నయ్యిరువురు నర్హాసనంబు
లనుండి యొండొరుల గుశలంబులడిగినంత నజ్జనవిభుండు వినయంబున నయ్యమర
ముఖ్యునకుం బ్రాంజలియై. 28

గీ. ఈవు నిలుచుండఁ గూర్చుండి యేమనిన్న, నొక్కసామాన్యుఁ గాఁ జూడనోడనైతి
ననఘ మాకెల్ల నిక్కువం బావహిల్ల, వైభవముఁ దాఁచియీలీలవత్తురయ్య. 29

మ. అపరబ్రహ్మవు నీవు నావుడు కృపాలా దేవకార్యార్థినై
యిపుడేవచ్చినవాఁడ నొక్క వినయంబే పాటి నేజేయన
య్యపదేశంబునఁ గానికూడ దదికాదా యట్టులేరాక నా
కుపచారంబొనరించెదే వినుమ దీయోద్దేశ్యముంజెప్పెదన్. 30

క. బలవంతులు దైతేయులు బలఘుస్మరముఖులతోడ బద్ధద్వేషుల్
కలహములు కాకమానవు, కలవాఁడవు నీవు విబుధకార్యంబునకున్. 31

సీ. నేమివినిర్భిన్న నిమ్నోన్నతంబుగా నవనిభాగమున బిట్టరుగఁ జాలు
చువ్వున నెగసి విష్ణుపదాంతరమున రెక్కలువచ్చెనో యనఁ గదలఁ జాలు
త్రోవనిన్నడుగక దుర్వార గమనమై దండశూకజగంబు దరియఁ జాలు
రవిరశ్మిరహితఘోరప్రదేశంబులు వెలిగించుకొనిచొచ్చి వెడలఁ జాలు
పెంచి యొకచోటననువై నటించఁ జాలు, మించియొకచోటవిభువై చరించఁ జాలు
దివ్యమీ తేరు మీకు నతిప్రయత్న, మున నొనర్చితి గైకొమ్ము మనుజనాథ. 32

ఉ. నీవిది యెక్కి పద్మభవ నిర్జరనాథుల జూడ నెప్పుడుం
బోవుచు వచ్చుచుండి పనిబుట్టిన వేల్పులపాలఁ గల్గి చే
చేవ యొకింత చూపుమని చెప్పితిరోహితుఁడయ్యె నయ్యెడన్
దైవతలోకశిల్పి యరదంబటు వెట్టి మహాద్భుతంబుగన్. 33

తరళ—మనుతనూభవుఁడుం బ్రమోదనిమగ్నమానసుఁడై నిజా
సనముఁ డిగ్గి రథంబు చెంతకు సంభ్రమంబున వచ్చి య
ర్చనమొనర్చి ప్రదక్షిణాదులు సల్పి ఖడ్గగదాశరా
సనశరప్రముఖాఖిలాయుధజాలమేర్చి యమర్చెనన్. 34

వ. తేరును వీరరసంబు దేర ం బోరుగోరఁ గహాకహధ్వనుల గర్జిలుచుండెం దద్ది

వ్యరథమాహాత్మ్యంబు చూడందలంచి విభుండు సేవాసమాగతమూర్ధాభిషిక్తులను
మంత్రిపురోహిత ప్రముఖనిజానురక్తులను నగరివాకిట నిలువంబనిచి నిజప్రథమకుమా
రు సుకుమారు సారథ్యంబునకు నియోగించె. 35

క. అనిపలికిన జనమేజయు, జనపాలకుఁడా ప్రతాపశాలికి నెంద
ర్తనయులొకో యనియడిగిన, విని వైశంపాయనుండు వినుమని పలికెన్. 36

క. నూర్వురు కుమారులతనికి, నిర్విఘ్నకృతప్రతాప నిర్వైరిదిగం
తోర్వీదుర్వహహథురా, నిర్వ్యాఘలుగలరఖర్వ నిర్వేలయశుల్. 37

క. సకల జ్యేష్ఠుండందును, విశుద్ధి యిక్ష్వాకుఁగొలువ వెసఁడమ్ములతో
నొకనాఁడు వాఁడు రాఁగా, సుకుమారుండనిరి దేరి చూచి మహర్షుల్. 38

క. ఆఋషివచనములతనికిఁ, బేరయ్యెక్ నాఁటఁగోలెఁ బ్రియసుతునతనిన్
సారథిగాఁగొని విభుఁడా, తేరెక్కి కదల్పఁబనిచెఁ దిన్నఁగమింటన్. 39

గీ. అవనినుండి మింటికి రథంబు రాఁగాంచి, నింగిఁదిరుగు ప్రొద్దు నేలకేల
పోయిరాఁగఁగడగెనో యని పైనూచి, కాదిదేమియంద్రు ఖచరసతులు. 40

వ. ఇత్తెఱంగున గగనంబునం బోవు సమయంబున. 41

సీ. ఒక వేల్పుతో మాటలకు నిల్వలసినఁ బగ్గముల్ గదియంగఁ బట్టుకున్నఁ
గెలని వింతలు చూడఁ దలఁపు గల్గినచోట నెప్పటప్పటివాఁగె త్రిప్పుకున్న
ముంచిపోవు విమానములు కూడఁగోరినఁ గేలెత్తి థే యని తోలుకున్న
జగదంతరప్రజాసమ్మర్ద పథముల హోధిరా యని వేగమాగకున్న
మనలఁ గేడించుఁ దిరుగు సమ్మతిగనరుగు,రథికహృదయంబెఱింగి యారాగుటాలు
నొగల కొక్కిండలంకార మగుటకాక, యేను సారథినని వాని బూననేల. 42

క. అని సుకుమారుఁడు నెమ్మన, మున రథరథ్యములమెచ్చి బొగడుచు నిచ్చం
జననిచ్చె నడుమ నారద, మునివచ్చెం గ్రొత్త యొలమి మోమున మొలవన్. 43

క. అతనికి జనవిభుఁడు యథో, చితసంభావనలొనర్చి చేతివిపంచీ
లత యందికొని శతాంగ, స్థితునింగావించి పలికెఁ జిత్తంబలరన్. 44

గీ. తివిచిచూడలేద గవిశన యొన్నండు, నోళవుదుమ్ముగప్పి యొప్పడాఁగి
తంత్రులూడి విన్నఁదనమొందె నిదియేమి, మహతి యున్నయునికి మానిచంద్ర. 45

క. ననుఁగరుణాలోకనమునఁ, గనుఁగొనఁగాఁగలిగె నొకొవి కాసము నెమ్మో
మునకుం గానీదేవర, కనుఁగవబడలికలుగన్న కైవడితోఁచెన్. 46

వ. అనినవిని మునివరుఁడు. 47

చ. పుడమికి నీవు రాజవయి పుట్టితి వెన్నఁడు నాటనుండియుం
గొడవలు గట్టిపెట్టి నినుఁ గొల్చిరి రాజులు కన్నుఁ దోయియున్
బడలక మించి యేకలహపారణతున్ వికసించుఁ దద్వ్యథన్
దడవులఁ బట్టి చూడనికతంబున మానె జుమయ్య వీణయున్. 48

శా. పాతాళంబున లేరె వీరుల చటంబాటిల్లవే కయ్యముల్
చూతుం గాకని పోవ దానును సమిచ్ఛాన్యంబు గాక గానిసీ
నీతో నేమి యటంచు చెప్పడితి మన్నిద్రాళు లోకంబు మ
చ్చేతః క్లేశము వాయఁబోదు బుధమ రాజీవాసముం గొల్వఁగన్. 49

క. అని వచ్చుచుంటి నిన్నుం, గనుఁగొంటిం బంధువయ్యెఁ గన్నులకును నా
మనవిపుడు నిండుకొనియెం, జనవరయొక మేలు దారసంబగు ననినన్. 50

వ. నగుచు నజ్జగతీవిభుండు. 51

క. నాకం బెట నలినాసన, లోకం బెట నిఖిలమానిలోకేశ్వర యీ
లోకములలోన భవభవ, లోకమునకు వేలువడిన లోకము గలదే. 52

ఉ. నావుడు నారదుండు నరనాథ భువర్భువనంబు మీఁదెలం
గీవల నెల్ల దీనికడ యెల్ల దివాకర మండలంబు …
మ్మావల నాకమాపయి మహర్జగ మావల కెక్కి … సిద్ధుఁడుం
బోవఁ … త్య్రజాక్షమెట పోవల తేనియుఁ ద్రోవ పెట్టెదన్. 53

క. మీతాతలోకలోచనుఁ, డాతండె వచ్చెవచ్చి యరదమునిలపెన్
నీ తేరి కడ్డ తెరువున, నీతో మాటాడఁ జూచ నెమ్మది …. 54

క. అని వైరించిని పలుకఁగ, దనరథమున నెరథము నేరఁ దలమి నృపాలుం
డినుమారు ప్రదక్షిణముగఁ, జనని చ్చె బురఃపురోనిషణ్ణాంజలియై. 55

గీ. ఇత్తెఱం … వలఁగొని యెదురనతని, మండలాభ్యంతరము గాంచి మఱియుఁ జేసె
నాలుగు ప్రదక్షిణంబులీలీల దొఁగ, దోఁ చెనో చక్రియని స్వారధ్యుఁడు నటింప. 56

గీ. అవనిలోకనాథుఁ డరదంబుతో నిట్లు, తపనదైవతప్రదక్షిణములు
రెండు మండలస్థపుండరీకాక్షు ప్రదక్షిణములు నాల్గు దగ నొనర్చె. 57

చ. … రథంబు నెక్కి సుదురెక్కిన యంజలితోడ నిందిరా
సదన సదాహితాభ్యుదయ సర్వసకాశనిజప్రకాశ క్రమో
త్క్రందన ఆగమాంత వేద్య రథకృత్య సమర్థిత వైనతేయ నీ
పదములు జూడఁ గంటినని ప్రజ్ఞఁ బొనర్చె యథాక్రమ నతుల్. 58

ఉ. అమ్మెయిఁ బ్రస్తుతించి నతుఁడై యతఁడయ్యెడఁ జూడఁజూడ బిం
బమ్మున నున్న మాధవుఁడు పార్థివు కంటఁబడం గరంబు చో
ద్యమ్మయి తోఁచె నారద మహాముని పేర్కొనె రాజరాజ నీ
యుమ్మడి కీర్తనం బిరువు రొక్కఁడు గానొనరించె గంటివే, 59

వ. ఈయంశుమాలి సాక్షాద్వనమాలియగుట ప్రకటంబయ్యె నని నుతించుసమయంబున.

ఉ. రార కుమార యంచు దినరాజు కవుంగిలి సాచి పిల్వఁగా
దేరికిఁ దేరు దారసిలఁ దెచ్చి కుమారుఁడు దాను వచ్చి యు
ప్పొంగుచు ధన్యుఁ డంబురుహ పాలనపుణ్యఫలంబ యావృశా
కారయుగంబు దాల్చె ననఁ గాఁదగు నంఘ్రులమీఁద వ్రాలినన్. 61

క. కరుణాకరశీతలుఁడై, యురువురనిరుగేలఁ గుచ్చి యెత్తి యొనర్చెం,
బరిరంభణ మంభోరుహ పరమాప్తుఁడు వారిహృదయ పద్మము లలరన్. 62

వ. ఇత్తెరంగున నాలింగనం బొనర్చి దినమణి సుకుమారుం జూచి నుతియుఁ
గలరు గాక మఱేమి యిట్టి భాగవతముద్రానిర్ణిద్రులు గలరే యని వెండియు. 63

చ. ఇతఁ డొకకాయ గాఁచి సుతు నిల్ల నిపించె మునీంద్ర వీనిసం
తతికభివర్ధనం బరయఁ దావకభవ్యకటాక్షపాతమే.
వ్రతమని పల్కఁగా ఘనత వర్థిల వైష్ణవ తేజమేఁగి భా
రతసుకుమారగర్భముఁ జొరంబడినం బ్రమదప్రసన్నుఁడై 64

క. ఇనుఁడయ్యందరికంటెను మును మున్న మహాద్భుతంబు మున్నిటి తెరఁగ్
మునిఁగిన మునిఁగని కంటే, వనమాలి కృపావిశేష వైభవమిచటన్. 65

క. వంశపతియై జగత్పతి, యంశంబున వీని కొకరుఁ డావిర్భవిలున్
సంశయమేమిటికిఁ బ్రియ, త్రింశత్కోట్యమరభరధురీణతఁ బెరుగున్. 66

కవిరాజవిరాజితము.

అనిచతురాననసూనునకున్ వినయప్రతిపాద్యబహూకృతులున్
మనుమలకుండగు మన్ననలుం దినసాధుఁ డొనర్చి జయించి విరిం
చన భజనంబుగ సాఁగిచనుం డని సారథివై పథరం బొరయం
గనుఁగొనఁ బశ్చిమ ఖండంబునపై రొకకంటి రథంబు వెసం బఱచెన్. 67

గీ. ఇత్తెఱంగునఁ జంగున నినుని తేరు, పడమటికిఁ దాటఁగాంచి యయ్యాయెడ యొకింత
నిలచి తడసిన వెనువెంట నిబ్బరముగ, వచ్చెఁ బొమ్మని నారదుండిచ్చ మెచ్చి. 68

క. కమలభవభువనయాత్రికుఁ, డమరయరదముఁ బఱపఁ బనిచి తండ్రికొడుకులన్

సామిదోననుండి చంద్రపుష్కరిణినుండి, వింటఁబడి వచ్చెఁ గాసారవిహగతతులు

మత్తకోకిల — వచ్చినంగని మానసాదినివాసవాసనివాసెసా
విచ్చిరాఁ బన్నియేమి యేమని విన్నవోకసులాకరం
బిచ్చె మానిసిమాటనేరుపు లింకపీనికభీష్టమిం
కెచ్చటో యనివారలారయ నిచ్చగింపఁగనచ్చటన్. 79

సీ. మొకరిదేఁటులు తీరవికచకేసరములు చేమంచియొక్కలఁ జేర్చికొనఁగ
తవరకొక్కెరలు బేడిసమీలఁదరఁగలు తెగఁదాటి నడిమికిఁ దెచ్చుకొనఁగ
కవజక్కవలు పళత్కమల కోమలదళావళులు బంత్తులుసాగ బిలిచికొనఁగ
రాఁగరాయంచలు నూఁగారఁబెటిఁగిన బిసములు దమపాలఁ బెట్టికొనఁగ
పరపుశతయోజనంబుల పాటినూష, బొడవుమతినూరుయోజనంబులుపొసంగ
గగనమిరవైన నిడుసాగగడ్డతోడ, గట్టెదుటఁ దోచెనపుడొక్క కమ్మకొలను. 80

వ. అయ్యవసరంబున నమ్ముగురుం దమలోక. 81

చ. వికచసరోవరంబు పసివేరునలంగకయుండ గెడ్డతోఁ
బెకలిచి తెచ్చిమింట మొలపించినవారిపు డెవ్వరో వివా
దకథకుఁ జోటుసూపని పితామహసర్గ నిసర్గవైభవం
బొకయిదె మేలు రథ్యముల కూరటగాఁ బదమూఁడఁ గల్గెఁగా. 82

క. ఈ వేళకిచటకొకకొల, నావిర్భావంబునందు నదికావున్నే
తావిన్న వినికి యవ్వివా, గావలికాదనినవచ్చు సాయిచ్చటతోన్. 83

వ. అని తలపోతలకుంజొచ్చిరందు మనునందనుండు వెండియు. 84

సీ. తివుట పుట్టింపవే పవనపాకంబు లీపాలపంబు దవ్వులపొలము గాక
కలుగదే కమలసౌగంధికాదికము లీవలపనాఘ్రాతపూర్వంబు గాక
యొప్పనుపొంగవే యూర్మి శీకరములీచలువవేఁ టెక వింతకొలము గాక
పొసఁగవే క్రౌంచసారసమిథునంబు లీసంసారమన్యాదృశంబు గాక
ఇట్టి కొలనెట్టు సేసెలేకేశుఁడనఁగ, నందుగంధర్వవిద్యాధరాదులపుడు
వల్లభులుదారు జలకేళి వలలఁబడిరి, సమధికవిమానములనుండి దుమికిదుమికి. 85

క. మగపిండు మగువపిండుం, దెగలేర్పడి చల్లులాడ దివికుప్పరముల్
వెగసిపడు వారిధారల, నగుదెంచె నమేఘవృష్టియంచలు సెదరన్. 86

వ. అంత. 87

సీ. ఒకరథాంగంబు కొంచకచంచుపుటి సుక్కుపూబ్బోఁడి వలిగుబ్బవొడిచిపోయె

నొక చేడెస వికస్వరోల్లాసగతి నొక్క కలికికన్నులవెంట బెళకుచున్నియె
నొకకచ్ఛప కిశోరమొరసి యెక్కులనొక్క తొయ్యలి మీఁగాళ్ల ద్రొక్కిపోయె
నొకమిండతుమ్మెద యురికి యుక్కునొక్క తరుణిధమ్మిల్లముఁ జుత్తన్నిపోయె
పోవుగాకేమి యీసులపాంతఁబోక, యెఱుఁగమే మేమి పుట్టునో మఱియునన
విభులఁబురికొల్పుచుర కాని వెడలరైరి, మెలఁతలా రాజలకేళి మీఁదిబ్రాళి. 88

క. ఈకరణిజలక్రీడలు, మేకొని యొద్దువారుఁ దటినమేరుచ్ఛాయల్
గైకొని యొడువారున్నై, యాకాశచరులెల్లలంగ నక్కొలనమరెన్. 89

ఉ. నారదుఁడప్పుడో నృపతి నల్వమొగంబు నదీని కారణం
బారసి విందుమన్న నతఁడానన చేరటువాయఁజీరమున్,
నీరముఁ జేరియున్న మహనీయుల మ్రింగి సరస్సుదానవా
కారముఁ దాల్చె వృత్తువిహగంబులు రక్కసులై భజింపఁగన్. 90

ఉ. క్రొవ్వన నార్చి శంఖనఖ కూర్మశిరః పృథురోమ దర్దుర
గ్రీవ శ్రవస్సహస్ర తిమికీకస రోహితమీనపుచ్ఛరా
జీవ భుజాది రాక్షసులఁ జేవచలెన్ జలజంతుభూమికల్
భూవర భూనరుండు మునిపుంగవు మోమును విల్లుఁజూడఁగన్. 91

ఉ. అప్పుడు నారదుండు మనుజాధిప యీజగదద్భుతక్రమం
బిప్పుడు గానవచ్చె నిది యేర్పడనంతయు నేగ్రమంబునం
జెప్పెదఁగాని తేరవిలుసిద్దము జోడుసిడంబు వీరికిన్
జొప్పడిరాకమున్న తెఁగఁజూడుము కొందఱనంచుఁబల్కఁగన్. 92

సీ. అజగవాదులకును బ్రజలైన ధనువులు బోదినాలుకలుగోయు ప్రదరములును
ఒరలువెల్వడి మంటల [illegible] యు ఖడ్గంబులుఁ గాలదండఖ్యాతిగని గదలు
దివ్యాస్త్రహతుల [illegible] లనిడామరములు జముఁ దుమూర్ఛిల మ్రోగు శంఖములును
నభ్రమ్ముకంటెనెత్తగు నట్టి పడగలు రవిరథ్యములఁ దట్టఁ దివురుహరులు
గలుగ వరలఁబరధములాక సైన్యముగ, నెదవ దనుజులం వధికులైరొక్కలక్షు
దాన వేతరరహితంబు లౌనుగాక, గగనకాసారదైత్యుచే జగములనగ 93

క. [illegible]వేళ దివిజకానన, దావాగ్ని నభస్సరోభిధానుఁడు రక్షో
[illegible]వు డొకవారథమున, వేవెలుఁగుల వెల్గుకంటె వెలుఁగుచునుండెన్. 94

చ. మనుఁ [illegible] పద్మజకుమారుఁగనుంగొని న [illegible] టనో
రన వసియించ వచ్చె రథరాజసమాజము వచ్చుఁగాక మీ

క్కుటపుటలు మాన్ప నొక్కెం, దకలుష దివ్యాస్త్రతతులనదియట్లుండెన్. 104

ఉ. ఏమనవచ్చు నయ్యెడ మొగిచిక్కిన యవ్విభు తేరుఁ బద్రథ
స్తోమము పించియాటలకుఁ జొచ్చిన చందమునందలీల మై
లోచెరపున్ వలిన్వెలుఁగులోకము పిక్కటిలంగ వైభవ
స్థేమము సూఁపుడాఁగు వెదకించుకొనుం బరతత్త్వమోయనన్. 105

ఉ. డాఁగనిచీపి తో మెకరుః డాగిన డాఁగగనీఁక నెత్తుటం
దోఁగ కతోచుచుం బగరఁ ద్రుంపఁగఁ జొచ్చె నృపాలు బాణముల్
మూఁగినమూకలుం బయల మూకలరోయఁగ బిట్టు నేలకున్
ద్రేఁగుగ రాలెఁ దద్వివిధ విస్ఫుట ఘోరశరీరఖండముల్. 106

వ. అప్పుడు. 107

సీ. కరికరస్థూలరక్తనవాంబుధారలు బలసి జోరున జడిపట్టి గురియ
తరుణమేదఃఖండశకరకాని క్కాయముల్ బేతాళభక్ష్యంబులై తోరంగ
ముఖహుంకరణశేషముఖరమస్తకములు బిడుగులై పలుగొంచ లడరఁ బడఁగ
నలఘుబాహులాతజంఘలు వెల్లిపాములై బలగమై పెలుచఁగప్పలుగ రాల
అద్భుతాసహమైన పర్జాగమంబు, భూభువన మెల్ల నెఱుఁగఁగ బుట్టెనయ్య
నరసురోరగ హితముగా ధరణిభుఁడు, గగనమునఁజూపు సంగ్రామకౌశలమున.

ఉత్సాహ— అట్టివేళ విశ్వకర్మ యరుగుదెంచి దీనికిన్
జట్టి పుట్టపఠమఁ బాంచజన్య జన్య శంఖమున్
బట్టి గాఁగ నిచ్చియుల నభస్సరత్సురద్విషున్
జట్టు ద్రేల భూవరునకుఁ జూపి యేకతంబుగాన్. 109

క. జలజహితవంశవరుని, బలుతూపుల వీఁడె రథము పైనొరగ వెసం
దలద్రుంచి యుపరదళనము, సలుపుట గర్జమని తెలిపి చనుచున్నంతన్. 110

వ. మధుప్రముఖ బలవదసుర సమరపరంపరాపరిచిత పరమపురుషాధరస్పందం బైన చిం
దంబు జనకంపంబుగాఁ బుట్టిన గెలుపుముట్టి సేకరిన యుత్సాహంబు దేహంబు
పొంగ నత్తుంగ నిజరథాధ్యక్షంబు దుర్నిరీక్షంబును హృదయానుసారి సర్వపథీన
పచారదక్షంబును సారథిని రక్షేక్షంబునై యుక్కు మీర నోరకుండ నోలయాని
పచండ కోదండధరుండై సుకుమారుండు కుమారుండునుం బోలె విక్రమంబునకుప
క్రమించిన తాండవపాండిత్యంబు కృత్యంబుగాఁ గమలభవాపత్యం బత్యంతనయ
న మధుర సంచరణానుభవ ప్రభవం బైన యానంపవిభవంబు ప్రకటింప వికటపుట

పతాకుల కెంపుగలుగందోలంగి నింగినాంగీరసపురోగములై గములగుచు గీర్వాణులు
చలాచలపాణు లగుచు నిరూఢవచనంబులఁ దనకు మంగళాశాసనంబులు సేయ నా
యత భుజావిజృంభమాణ బాణాసనంబుతోఁ బినాకిపాణియుం బోలె నాఖిలశరజా
లజ్వాలలం బ్రేలిచి యాడుచుండం గలగుండుపడి విడివిడిగాఁ బలల భుగ్బలంబు
ప్రాచికవాచికిం బతీచి కుదీచికిం బరవఁ బఱవసంబు గల మగలుకొందఱందఱిం
బేరుపేరంజీరి. 111

గీ. పాఱుఁడొక్కఁడొకఁడుపడుచువాఁడిటవచ్చి, పోయిరొకఁడచిక్కిపోటుబంటు
కలను వోడువ నుప్పుఁ గలువోలె నిక్కచ్చి, తేరువానికోడువారెమారు. 112

చ. అనివారిం బురికొల్పఁ గోల్తలకుఁ జేయం గల్గువా రగ్నిలో
చన పాతాళవిభేది మత్స్యమథన స్వర్గాంతకాదుల్ శరా
సనముల్ నింగికి బ్రేశి పట్టుచు భుజాసంరంభ మేపార శం
ఖనినాదక్షుభిత త్రిలోకముగ వీఁకన్ దాకి రొక్కుమ్మడిన్. 113

గీ. వారివెనువెంట శౌర్యధుర్యారుఁడగుచు, నపుడునృపబాణవితతిఁ బ్రత్యస్త్రహతుల
గూల్చి మాడ్చుచు వచ్చెఁబోఁగూర్మశిరుఁడు, వెలికిలోనికి నెవఁబాఱ తలయుఁదాను.

చ. మనుజవరుండు కూర్మశిరు మస్తము వెల్వడువేళ వేఁచి తో
డనఁ బలు తూపుఁ జీలలు మెడం బిగియించి భవన్ముఖంబు నీ
యనుఁగులు వింతవింతపడి యందరుఁ జూతురు గాక లోనికిం
జొనుపకు మన్న నీవు నిఁకఁ జూతువుగా యని యల్గియాతఁడున్. 115

క. ఒకకూల మెత్తివైచిన, సుకుమారుఁడు నడుమ నఱుకఁ జూచి విభుండ
వ్వికటశిరుశిరము దమజాలు, తుకతుక నుడుకంగ వాఁడి తూఁపునఁ గూల్చెన్.

గీ. నూఁడుపట్టి పెనగుచో మీనపుచ్ఛుని తోఁకఁదునుము కొడుకుదుండగమున
కధిపుడల్ల నవ్వియుద్గాయ రక్కసి, బ్రతుకుమాన్పె దివ్యబాణమేసి 117

సీ. జనకుండు దుమికి కమునిఁ గిటడంచినఁ దనయుండు పృథురోము తల యదల్చె
గురుఁడు శేకగ్రీవు కుత్తుక దునిమిన సుతుఁడు రోహితుని జీవితముఁ గొనియెఁ
దండ్రి యన్వరవిమూతకు బారిసమరినఁ గొడుకు శంఖనఖాఖ్యుఁ గోలుమసఁగ
నయ్య రాజీవబాహాసురుఁ బొలిఁగొన్న బిడ్డండు కునఖునిఁ బిలుకుమార్చె
దివిజరాజాదిదిక్పాలదేవతాక, విశిఖముల నిట్లు సైతేయ విశసనంబు
సలిపి రిక్ష్వాకు సుకుమారు లలయ కెలమిఁ, గొంతవడి పంతుపడి మరుత్కోటిపై ...

భుజంగప్రయాతము.

గిరిస్కంధుఁడుగ్రాజికేళీధురీణ, త్వరం బార్వతంబైనవాలంబుపింటన్
గదంబల్గి సంధింపఁగాదాని వానిం, ధరాభృద్ధనుర్ముక్త దంభోళితీర్చెన్. 119

ఉ. అంతటఁ గేలుమోడ్చి కొడుకయ్యెడఁ గయ్యము సేయవచ్చునా
కాంతక మర్త్యభేది పలలాశులఁ బేర్కొని చూపి వీరునా
వంతని కొన్ని యయ్యకొని వానికి వారికిఁ బోరు వెట్టి వృ
త్తాంతవిశేషమింకఁ గలదాయని రాజు మునీంద్రుఁ జూచినన్. 120

క. తలయూచి యతఁడు భళిభళి, కొలువోయిది రణము యిష్టగోష్ఠికథకుం
దలసూపె నిట్టితేజము, కలుగున కద యింతకొడుకుఁ గాంచిననీకున్. 121

సీ. అనిపల్కి చెప్పెద వినుము వేఱొకఁడేల జననాథ గగనకాసారకథయ
యప్పేరువానికి నన్వర్థమని సరస్వతి పల్కె వినువీధి జననవేళ
వాఁడుగ్రతపమును వాతాతపాదులు గ్రోలి పుట్టిననాఁటఁ గోరెఁ జేసె
దాన లోకములు కొంచలముండఁగా నజుం డడిగిన వరమెల్ల నతనికిచ్చె
నవనియవనిగ నాకసంబాకసముగ, జలము జలముగ గాడ్పుగాడ్పుగనుబొంచ
భూతికాంగంబు సరసియై బయలు బ్రాఁక, రాజిలునతండు తేజంబు తేజముగను. 122

క. కొలననుచు మునులు వేల్పులుఁ, దెలియరు తత్కపటచేష్టఁ దివురుదురాడన్
గలనైన వచ్చుమాయా, బలవద్రథసాధనములు బ్రహ్మవరమునన్. 123

గీ. మఘవముఖుల నైన మఱునాఁటి కడిగించు, కొనునతండు మ్రింగియనుమఁగాదె
దనుజహానన కుక్షిదళన వేగముఁ గోరె, నుపరగతులమనుపఁ ద్రిదశశిల్పి 124

ఉ. ఇట్టివరంబు లక్కసురకిచ్చినవాఁడజుఁ డిజ్జగంబు లె
ట్టట్టగునో యట చపుడ యింతటి తేజస్సృజించియిచ్చి మా
పట్టియ నిర్వహించునని పంచెఁ జుమీ సురరాజశిల్పి నీ
చుట్టపు టోడు పాటునకు జోదులరాయ జయించి తిందరక్. 125

పంచచామరము—అలంతులయ్యె కూర్మమస్తకాదులైన జోదుల
బ్బలారి వెన్నుసూపి నారపాచినాఁడ కాని నే
డలంఘ్యబాహుశక్తిఁ దావకాజిలోననంచుఁబి
చ్చలించి తెల్పెఁ దత్కథల్ వచఃప్రయోగచాతురిన్. 126

క. ఈకథలు ముగియునంతకు, నాకాంతకమర్త్యభేదిన క్రందరబా
హాకథలు ముగిసె శరథా, రాకృతిచిత్రవనవిభలరాట్పునతు చేతన్. 127

ఉ. వెచ్చె సమిన్నభంబు పరివీతశరార్చుల దైత్యసైన్యముల్
విచ్చె హతావశిష్టులును వేలుపు మొత్తము రాకుమారునిన్
మెచ్చె విషాదహర్షములు మేగలు మీరుట లేర్పడం బడం
జొచ్చె నభస్సరత్సుర నిషూదనుచూడ్కుల నీలునిప్పులున్. 128

ఉ. అప్పటి బంధువీరవిరహప్రభవంబగు ఖేదమల్కకుం
ముప్పిరిగొల్పిపోఁ దనమోమును గన్నులుఁ జేవురింపఁగా
నప్పిశితాశనాధుఁ డహహా ధను వేను ధరించు పాటిపో
రెప్పుడు గల్గునో యనఁగ నిప్పుడగాయొనఁ గూడెఁ గ్రక్కునన్. 129

చ. అనిహతశేషభీతరధికావళిఁ బేరునఁ జీరి పేరెలుం
గున మనమెల్లరుం గుడుచు కూడు చుఁడీ మనుజుండనంగ నే
మని తలలూపెఁ బారెదరొ యంతటి యాదొర లేమి బాసనో
యనిఁ బడిరంచు సైనికుల నందఱఁ గూర్చి యుదర్చిరాక్పతిన్. 130

లయవిభాతి.

వెలుఁగుచు నతండు తనకెలకుల నచ్చునృపదళితరధిజాతరధములకు నిజమాయా
బలము మెయి మున్నెపుడుగ లరధిక సారధులు గలిగి కతినాట్టహాసములు సెలఁగఁ గాఁ గో
ల్తలకెదురు జేయఁగని కలఁగి సురకోటిమది బలు బెడదవచ్చెయిఁక గెలుపరిదివీరల్
దొలుతెఁ దలపాటుఁ దమపలుదలలపాటు లిటుగలుగవనిపింతుర టె గలబెడఁగులందున్.

చ. అనితలపోసి చూత మెటులయ్యెడునోయని వేఁచియుండఁగా
నినకులదీపకుండుఁ దనయేటులఁ బోయినవారికిం బున
ర్జననము తోన కల్గుటకు సంశయవిస్మయ రూషితాత్ముఁ డ
య్యును మది జీరికిం బోనక యుచ్చరవంబుగ శంఖమెత్తినన్. 132

చ. చినిఁగె దిశల్ నభంబవిసెఁ జిందరవందరయై గ్రహస్థితుల్
సనియె వియద్ఘురం బొలికెఁ జాలెసురాళి కపాయశంక కం
పనమున భూతముల్ మిడిసె భైరవుఁడుల్కె విధాత బెగ్గిలెం
బనివడిఁ దేర్పఁ దేర్ప నలభర్గుని కౌఁగిట దుర్గమూర్ఛిలెన్. 133

క. మాయావిషహరమంత్ర, ప్రాయాగత పాంచజన్య ఘనహుంకార
ప్రాయాగత మహిమనత, న్మాయారధిసృష్టి యంతమాయంబయ్యెన్. 134

వ. అట్టి మహాఘోషంబు నిజరోషంబునకు దోహదవిశేషంబుగాఁ గొని మనుజవిభుండు
దనుజవిభుమీఁద నురవడించిన. 135

గీ. ఇటులు నిటల ఘటిత, కుటిలభ్రుకుటియైన మొగము తోడ వీరమూర్ఛనున్న
తంత్రికయ్యమపుడు తానందికొని సుతు, మారుఁడట్టహాస ఘోరభంగి. 145

ఉ. విల్లురమంగఁ జేసి యొకవేఁడిశరం బరివోసి యేసి య
బ్బల్లిదు ప్రక్కనొంచిన నపాయపు టూపిరికుట్టిచట్టి మూ
ర్ఛిల్లి యొకింతలోఁ దెలసి చిచ్చులుమూఁడును మూఁడు మోములం
జెల్లిపెలుంగు శూలమునఁ జిన్నదొరం బలు మూర్ఛముంచినన్. 146

గీ. అసురవిభుజూచి మునినాథుడౌటవిడచి, వెసలెవనివెత్తిరాకుండ బుడమి కేఁడు
తెలిసిగదఁగొన్న రిపుశక్తిదిగిచివైచి, మఱియొరఁగిక్రమ్మరం దేటి యురక నిలచి. 147

మ. దితిజేంద్రాతిశయంబు దద్రథరణోద్రేకంబు దత్తాదృశో
ద్ధతయోధాదిక విభ్రమంబుఁగని యేతస్మాత్రబాణోత్కరం
బు తరంబా యివిచక్కఁ బెట్టనని శంభుబ్రహ్మసంభావితా
త్కృత నారాయణదైవతంబయిన యస్త్రంబుం బ్రయోగించినన్. 148

శా. ఆయస్త్రంబఖిలాస్త్రశక్తిజనకం బత్యుగ్రసారం బఖి
ప్రాయజ్ఞంబు సమస్తసాధనరథవ్రాతంబుతోఁ గూడఁద
న్మాయాజేయులదానవేయులను భస్మప్రాయులంజేసి దై
తేయాధ్యక్షు శిరంబుద్రుంచికటువృత్తిం గుక్షి భేదించినన్. 149

క. దుడిదుడి వెసలెడుదానవు, కడుపోకలోకమని మెలఁగిగంధర్వాదుల్
తడవుండమిఁ జెడిరంతటఁ, బొడి సఁదదస్త్రమసుర బొంగియుదేరన్. 150

సీ. ఇత్తెరంగున నమ్మహత్తరసాధనం బసురదాహక లీల లాచరించి
యుపశమింప నృపాలుఁడు త్వాటితత్రిశూలంబు బాహాంతరాళంబు తడవి
తేర్పఁదేరికుమారుఁ డార్పుతోడగ్గనలేచి నల్దిక్కులుచూచియాడ
నగినారదుఁడుపిల్చి నారాయణాస్త్రప్రభావంబుమెుక్కి యుపన్యసించె
నతఁడు మానికి తొనికినతులొనర్చి, రాజుసుతు,గౌఁగలించి నారదునకరఁగ
దపసి యిరువుర దీవించెఁదపన కులుల, వారిపైఁ బుష్పవృష్టియవ్వారిగురిసె. 151

(కందద్వయగర్భిత భాస్కరవిలసితము)

పంచవదను నలువుల్ దిశలించెన్ భాస్కరవిలసిత మెలమిరహించెన్
గొంచక విబుధవిభుఁడరుదెంచెన్ గొప్పసురలు నృపతిలకులగాంచెన్
మించెఁ బ్రణయ పరిరంభముపెంచెన్ ప్రమొక్కులఁ బ్రియములుపిదప వరించెన్
బొంచి కనినజయకందము లెంచెన్ బోరితెరఁగులిటు లెలమివహించెన్. 152

యిందు కందద్వయవిభాగము.

క. పంచవదను వలువుల్ దిశ, లించెన్ భాస్కరవిలసిత మెలమిరహించెన్
గొంచకవిబుధవిభుం డరు, దెంచెం గొప్పసురలు నృపతిలకుల గాంచెన్. 153

క. మించెబ్రణయపరిరంభము, పెంచెన్ బ్రమోక్కులర్ బ్రియములు పిదపవరించెన్
బొంచిక నినజయకందము, లెంచెం బోరి తెరగులిటు లెలమి పహించెన్. 154

వ. అనినవిని జనమేజయుం డవ్వలికథాక్రమం బెట్టిదనిన. 155

మ. నతనానావరపాల మౌళివిలసన్మాణిక్యనీరాజనాం
చితపాదా దళితారి వీరజయలక్ష్మీగేహ బాహా
బలప్రతిభానిర్జిత హేమగర్భనృప సర్వక్షమాపాలసం
శ్రితమందార మహీజ భూధరణ శేషీభూతమాద్యద్భుజా. 156

క. భేరీభూరిధణంధణ, ఘోరారవకుపితగంధకుంభిమదాంభో
ధారాఘటితధునీకలి, తారామవిహార విజయయాత్రాభరణా.

దధోద్ధతవృత్తము. 157

గౌరితారిణితకంజబాంధవా, జారిమానిదినయామినీభ్రమా
చార చారుసుయశః ప్రతాపసం, చారదూరితరసాసలీభయా. 158

గద్య.

ఇది శ్రీమత్తి— తోళప్పాచార్య చరణసరసిరుహసేవాసమాలబ్ధసామ్రాజ్యధౌరేయ నిజకావ్యాభిరక్షాయమాన యెల్లభూపురందరవరనందన మల్లనంతమహీనాథప్రణీతంబైన కకుత్స్థవిజయంబను ప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.

శ్రీరస్తు.

# కకుత్స్థవిజయము.

## తృతీయాశ్వాసము.

క. శ్రీచోడవంశభవ యహి, తాచారభిదాప్రచండ యయ్యారగండా
భూచర ఖేచరలోచన, గోచరసుమభల్ల మల్లికోనయయెల్లా. 1

వ. అవధరింపుము మనునందనకథాసుధాధారాధౌతమాన సామేయజయుండగు జనమే
జయునకు శంపాయనుండగు వైశంపాయనుండిట్లనియె. 2

ఉ. వెండియు వజ్రపాణి నృపవీర తపశ్చరణంబు నాఁటి యా
యెండకు వానకుం జలికి నిత్తుశరాసను తోడుగాఁగ నీ
గుండియ యంతగాఁగ నెరఁగోసిన నాతగవెంత యట్టి యు
ద్దండత సైచి గండమిది దాటితి నీవెనరెంత మాపయిన్. 3

మ. అని యారాజు తలంపెఱింగి యజలోకాలోకలీలోత్సవం
బునకే మున్ జనుదేరఁగాఁ జనుట యొప్పంగాదె రమ్మంచు నా
యనఁ దోకొంచు బలారి వహ్నియమదైత్యాంభోధిపప్రాణమ్మరు
ద్ధనదేశానులు రా విమానముల వింతల్ సూపుచుం బోవుచున్. 4

సీ. విద్యాధరాదులు వీరు నీచే నేఁడు బ్రతికి వచ్చిరి వీరిపాట వినుము
వెన్నెలపాలము నీవియ్యాల కులకర్త చంద్రుఁడే యీతఁడే చాయరమ్ము
జలజారి యాఁడుమండలమిదే నీకీర్తి గరలించు కులకర్త మరలిచూడు
సహలుసమీరపాశము లెత్తి నీగెల్చు గ్రహగతుల్ చక్కఁగాఁగాఁ జెఁజూడు
మనుజవల్లభ సప్తర్షిమండలంబు, వేదసంవాద ముఖరంబు నాదరింపు
శిరసు మిన్నిటఁ దడియంగ శింశుమార, చక్రగతుఁడైన ధ్రువుపెంపు సన్నుతింపు 5

క. ధ్రువమండలమాదలగా, రవిమండల మడుగుగాఁగ రాజిలుపదునా
లువు లక్షల యోజనముల, భువనము త్రిదివమిది భోగభూమి నృపాలా. 6

క. కృతకాకృతక త్రితయ, ద్వితయమునకు నట్టనడుమ దీనింగంటే
కృతకా కృతకేతరత్రా, యుతము మహర్జగము కోటియోజనము నృపా. 7

మ. జనలోకంబున నందనాదుల నివాసం బొప్పు నీక్షింపు యో
జనకోటిద్వితయప్రమాణమిది భూపాలవల్లభుం డాత్మనం
దన యోగ్యంబుగఁ జేయ నాఁడ కృతకాస్యంబయ్యె రాజభా

జనముం జూడుమహాశ్చతుర్గుణము రాజన్యా తపోలోకమున్. 8

మ. అపునర్మారకలంబు చోటకృతకాధ్యక్షుంబు కల్పాంత దా
హపుటాయాసము పొందు పార్వంబు రాదంద్రందురే యట్టి బ్ర
హ్మపదం బల్లదె యూరుగోలలది సత్యంబన్న నన్వర్థమీ
యపరూపంబును జూడఁ గంటివిది భాగ్యంబయ్యె రాజోత్తమా. 9

చ. అనిపలుకన్ నృపాలుఁ డమరాధిప యిక్కడియుంపెలెందుఁ జూ
చిన యవి కావనష్టము లశీతలముల్ బహుభానుచంద్ర సం
జనిత మయూఖ సంఘముల సందడిచందము నిండె నేమొకో
యనవుఁడు మానవేంద్ర వినవా యివి బ్రహ్మసభావిభావముల్. 10

క. వింతలుగావా యివి తమ, కెంతలజేరంగనీఁ కశీతోష్ణకర
ధ్వాంతంబులైన వెలుఁగులఁ, బంతంబున మెసలువట్టి పాయఁగనూఁకున్. 11

క. తనయులకును మనువులకును, దననేరుపు నూరిపోసి తాల్చిన సర్గం
బున భరము వారిఁబూనిచి, పనిచేరి విధాతయీసభం గొలువుండున్. 12

చ. ప్రమదవనంబునం బ్రియసరస్సుల రత్నకృతంబులైన కు
ట్టిమములఁ జాట్లుకోటలఁ బటిన్మయకుడ్యములం బర
స్పరభ్రమద మహాస్వరూపమున పజ్జయు దవ్వు నెఱుంగనీని వి
భ్రమముల నాసుధర్మ నెరవట్లు విధాతృపురీనికేతముల్. 13

క. తాదృశ పురహర్మ్యములకుఁ, దాదిలియగును దినకరసుధాకర తేజః
ప్రాదుర్భావనిదానము, హాదీధితి తెలియఁదరమె యీసభమహిమల్ 14

క. అనిదేవేంద్రుఁడు సకలము వినిపించుచు రాఁగ దివిజవృతుఁడై రాజుం
దనసుతుతో మునిపతితో జనిచొచ్చెం దజ్జగంబు చతురదధగతిన్. 15

గీ. జనవిభుండట్లు బ్రహ్మదేశంబు సొచ్చి, బ్రహ్మనగరంబు దరిసియా బ్రహ్మదేవు
నగరి హజ్జారమున వాహనంబుడిగ్గి, బలభిదాదులుఁ దానును బ్రహ్మసభకు. 16

వ. పిలిపించికొని చేరం బోయి నంత. 17

సీ. అనఘు యోగబ్రహ్మలగు సనకసనందన సనత్కుమార సనత్సుజాతు
లను కుమారులు భృగుండును బులస్త్యుండుఁ బులహుఁడు గ్రతుం డంగిరసుఁడు మరీచి
యును దక్షుఁడును నత్రియును వసిష్ఠుండును నననవబ్రహ్మలై తనరుసుతులు
నెండియు మన్వాది విశ్వకర్తలు ప్రజాపతియు లూర్ధ్వరేతులు నయనములు
మిహిర మిహికాకరాదిక గ్రహగణంబు, మేషమీనాదిమాంతిమాశేషరాసు
లశ్వినీముఖ్యతారలు నక్షత్రభఙి, సోలగము సేయ నద్భుతంబోలయమజియు. 18

సీ. శ్రుతు లంగములు బహుస్మృతులు మీమాంస తర్కముఁ బురాణేతిహాసములు నవలి
గానాదివిద్యలు నానాప్రకారభాషలును గాష్ఠాకళాక్షణముహూర్త
దివసవిభావరీతిథిపక్షమాసఋత్వయనహాయనయుగతాప్రభేద
కాలంబు ధర్మార్థకామమోక్షములు దక్షిణ లధ్వరంబులుఁ బ్రణవమంత్ర
వర్గములును బ్రాచ్యవాచీప్రతీచ్యుదీచ్యాదిదిశలు నుజ్జ్వలాభిరామ
మూర్తు లుల్లసిల్ల మోడ్పుఁగే లురముల, నిలిపికొని భజింపఁ గాలకులందు. 19

క. ధృతియును మతియును బుద్ధియు, రతిశబ్దస్పర్శరూపరసగంధాక్ష
స్మృతిసంకల్పవికల్ప, ప్రతతశమదమములును రూపరమ్యతఁ గొలువన్. 20

సీ. భావగాంభీర్యసంపదనగాధత్వంబు గానరా సప్తపాథోనిధులును
మోహనాంగంబుల మొలచు లేఁజెమటల జలమయత్వము తోఁప సకలనదులుఁ
బ్రబలబాహాంతరప్రథిమఁ గాఠిన్యంబు బయలుద్రొక్కఁగఁ గులపర్వతములు
సురభినిశ్వాసవైఖరిఁ బుష్పజాతులతావు తేర్పడ వనదేవతలును
దృగ్గరిమఁ బావనతఁ దేటఁ దీర్ఘములును, గటిపృథుత్వంబు వొడసూప గహ్వరియును
దివ్యమూర్తులతోఁ గొల్చి తేజరిల్లఁ, దనరు పరమేష్ఠిఁ బంకజాసనుని గాంచి. 21

వ. వసురుద్రాదిత్య గరుడగంధర్వ విద్యాధరాదులుఁ బావకప్రముఖులు నంతనంత వందనంబులు సేయ నముచిమథనుండు నారదబృహస్పతిపురోగముండై కొంత చేరంజని పరమేష్ఠికిం బ్రణమిల్లి ప్రణవాదినమోంతవచనంబులం బ్రస్తుతించి మనుతనూభవుం జూపి నభస్సరాసురసంహారపౌరుషం బుగ్గడించుచుండె నతండును బితామహసభామహావిభవవైలక్షణ్యవిలోకనజనిత విస్మయవిస్మృతసేవాసమయసముచితవ్యాపారుండై సుకుమారుండు కొండొకవడి యూరకుండి పదంపడి తనయునుంగుఁ దండ్రి యక్కొలువుననుండి చేరవచ్చి మన్ననుగ్రహంబున న్నరలఁ దేర్పం దలిపొంది.

క. అకరస్పర్శకృతాఖిల, సకలనిటలతారతమ్య సఫలాక్షరతే
ఖిక దేవమీకటాక్షము, వికసిలుఁగా కనుచు నెరఁగి వెండియు బత్తిన్. 23

సీ. పూర్వగీర్వాణులఁ బుట్టించి యామిని యైయుండె నేదేవు కాయ మొకటి
సురసంఘనిర్మాణపరిణామమునఁ బొల్చె దివసమై యేదేవు దేహ మొకటి
పితృదేవతలను గల్పించి సాయంసంధ్య గా నేర్చె నేదేవు గాత్ర మొకటి
బహుమనుష్యులఁ గాంచి ప్రథమసంధ్యాభావమున నిల్చె నేదేవుమూర్తి యొకటి
యతనిని బ్రసన్నునిం జేయ నతనిచేతఁ, బావితుఁడఁ గాఁగ నతనికిఁ బ్రణుతి చలుప
నతనిఁ దలఁప బ్రాప్యజ్ఞాన మధిగమింపఁ, గోరుదు నతండు నీవఁ జూ భారతీశ. 24

వ. రంగేశ్వరుకొలువునం గనుపట్టినయట్లుగా నతనిం బుట్టించిన దేవుండవై సేవకృపచే
సి తనిన నవ్వి యవ్విరించి యగునగు బహువిధతపంబులకతన నతనిం బుట్టింపంగం
టి ముక్కంటిమొద లేనుదుప తదీయసన్నిధానంబమరి యట్లుండుదు నది య
ట్లుండె మదీయసర్గంబులు కొన్నియుగ్గడించి తదనుగుణ మనోరథంబులు నీకుం గ
లుగఁ జలిపినాఁడవు. 25

ఉ. వేల్పులకంటెను న్నసురవీరుల మేను సృజించు టెంచి సం
కల్పము మాప్రసన్నతకుఁగా నొనరించితి నన్న నీవచః
కల్పన కర్థ మేమి యలకయ్యము మాకు ననిష్టమంచు నో
యల్పులఁ ద్రుంచి లోకములయాపదఁ దీర్చితి వింత యొప్పదే. 26

వ. ఇంకొక్క యొచ్చుమాటయుం గలదు. ప్రాప్యజ్ఞాన మధిగమింపఁ దలంతు నంటివి.

క. చను నే ప్రాప్యాంశమునకుఁ, జనవరి నటు పలుకఁ బ్రాప్యసంపద యెల్ల
న్మనుమున్నఁగఁ దలమోపునఁ, గొనిచనవా మమ్ము నడిగి కొనివచ్చితివా. 28

గీ. అనుచు శ్రీరంగధామంబు నాత్మనిడి కృ, తాంజలియుఁ బూర్ణపులకుఁడు నానివాలి
తాత్ముఁడును నైపదంపడి హర్షబాష్ప, భరమెసఁగ నెప్పలెత్తి భూపాలుఁ జూచి.

ఉ. ఏమనుచుండు రంగపతి యింకిట మాపటికైన వచ్చునా
యామొగ మాయలంతినగ వాతలయంపిగ నిద్దబాహు వా
వామభుజంబు చాఁపు మఱవంజన దెప్పుడు వచ్చు రేయి యే
నీమముఁ బట్టి నాతపము నీదగునో యతిలోకపార్థివా. 30

పద్మనాభవృత్తము.

రావన్న రాజన్యరత్నంబ నీయట్టి రాజర్షియున్నాఁడె నాసృష్టి యందున్
దైవంబు నీసొమ్ముగాఁ జేయఁ గంటే కదా పద్మనాభావతారాశ్రయంబై
నీవంశముం బెద్దవర్థిల్లు మామీఁది నెయ్యంబు డెంపంబునన్నిల్పు మంచుం
దీవించి సత్కారసంప్రీతు నమ్మేదినీలోక సంరక్షకు న్వేగనంపెన్. 31

వ. ఇంద్రాదులుం దమ నివాసంబుల కరుగ ననుజ్ఞాతులైరి. అంతం గుమారసమేతంబు
గా నతిలోకభూలోకేశ్వరుండు. 32

గీ. నలువయడుగుల ప్రాలి సభ్యులకు మ్రొక్కి, గురువకెరఁగి సారకునఘఁగరము మొగిచి
మరలి రథమెక్కి రూఢవిమానశక్ర, ముఖులతో నమరావతిప్రోలు ప్రాలి. 33

వ. గగనతరంగిణిం గనుంగొని. 34

క. బలజంభరుధిరగరపవి, నొలఁగ్లిన పెన్నిటి రేకతో నీనది యొం

తలఁచెను నిర్వృతక్రతువు, లలాటరేఖావిభాసి లలనల నగుచున్. 35

క. అని తత్పుణ్యోపాసకములఁ, గొని కొనియాడులకు నిలిచి కొలిచి నదిన్వి
డ్కొని యమరావతి సొచ్చెం, జనపతి యొక యెదురుకోలు సంపదఁ గనుచున్. 36

వ. అది పురందరవచనసమాగమంబున జయంతుఁ డతనికొనర్చిన యెదురుకోలు విను
మిత్రైఱంగునఁ దత్పురప్రవేశంబు చేసి. 37

సీ. నందనవనవాసనలసొంపు విలసింప నలసంపుఁ జలిగాడ్పు లనుసరింప
నెక్కొనమణిహర్మ్య మేచాయ యాచాయ మేచాయఁ గలసతు ల్మెఱసిచూడఁ
దనపేరఁ దెగి యందు మనువారు దనవారితనమూఱఁ జెఱునవ్వుదనికి మ్రొక్క
యజ్ఞభిక్షాదాత యని వేగ మనురాగ మునయాగఫలభాగు లనుమతింపఁ
దనకు సురరాజు నిజరాజధానివైభ, వములు చూపుచు సంగడివచ్చు నపుడు
దను నతఁడు మించిచననోడఁ దానుతని, మించిచననోడఁ జౌరులీక్షించిరలరి. 38

గీ. ఇవ్విధంబున సాహార్ద మెలయ నరిగి, నగరిమొగసాలకడ వాహనములు డిగ్గి
పెద్దలిద్దఱు ముందటఁ బెరసి కేలుఁ, గేలఁగొని వేత్రిహస్తులు మ్రోలమెఱయ. 39

క. సుకుమారుండు జయంతుఁడు, నొకజోడయి రా దిగీశు లొకగుంపై రా
నొక రౌననఁ గక్ష్యాంతర, వికస్వరశ్రీలు చూడ్కి విందులు సేయన్. 40

శా. చేరంజొచ్చి సుధర్మయందు విలసచ్చింతామణీపీఠికం
దారాసీనులుగా దిగీశు లుచితస్థానంబు లందుండఁగా
ధీరోదారకు మారులొక్కమణివేదిం గూర్చి కూర్చుండఁగా
నారంభాసతు లాడి రెచ్చుజత హాహాహూహూవు ల్పాడఁగన్, 41

క. ఇవ్విధమున నుత్సవముల, నవ్వుల నితిహాసముల మనఃప్రమదంబు
ల్నివ్వటిలఁ జేసి యింద్రుం, డవ్విభునకు నొసఁగె మణిమయాభరణాదుల్. 42

వ. ఇట్లు బహూకరించి యించుకవడి దలంచి. 43

మ. భుజశౌర్యంబునఁ బెద్దవై హితుఁడవై పౌరానిబంధుండవై
త్రిజగద్రక్షణదీక్షకెక్కితివిఁకేదీయిచ్చుమాదీవనల్
నిజమైనరిలుమన్న రాజతనుపాళీయావనప్రౌఢికి
న్విజయంచేసెను బ్రహ్మపుత్రుఁడు హిమానీయక్కులగాత్రిమణీ. 44

క. అచ్చతురాననసూనుం, డచ్చటఁ దానపుడు మొలచి యాశీర్వాదం
బిచ్చెనె యింద్రుఁడు మెఱుఁగులు, దెచ్చెఁగదా ప్రాయమునకుఁ దీవననినన్. 45

గీ. సేమమెచ్చు ననఁగ జిష్ణుపరిష్ణులం, దుపచరించిరతనినుచితవిధుల

నొల్లసిల్లి మునియు నుభయాక్షిముఖవేది, నభిమతాసనమున నధివసించె. 46

సీ. విషమసాయకునకు విజిగీష వేఁడంటి నేఁడుగా వెసవిల్లు వాఁడు నిల్పెఁ
వసుగంధవహునకుఁ జల చిటచిట దీఱ నేఁడుగా నునుదేఁటి గూఁడు దెలిచెఁ
బిష్వాకరుని పూర్వపూజకుఁ దెరవుచ్చి నేఁడుగా పూవుఁదోవ్వాఁడి యయ్యెఁ
గుముదబాంధవుప్రతాపమునకుఁ జలివాయ నేఁడుగా వెన్నెల వేఁడిఁబెట్టె
వలపుఁ జల్లవచ్చి వలచిన వలపాక, తపసితోని శాపకృపలఁ జేసి
కలఁగి తేఁటి యిట్లు కర్పూరతిలకకు, నేఁడుగా పునర్జనికి ఫలించె. 47

వ. అని పూర్వోక్తరకథాసంఘటనంబున కుపక్రమించి. 48

చ. వరమున నట్టి రెండవశుభవంబున నట్టి సురేంద్రుకొల్వున
చ్చరయటె నిన్ను మన్మథచక్షవదుఁ జేసి తరించెనట్టి యి
ట్టిరె మగ లెందు నెక్కడి పటీరతుషారనగంబు లేటిమం
దర మని నారదుండు మనునందను ధీరత మెచ్చి యిట్లనుఁ. 49

సీ. నిర్జరేశ్వరసఖ నీచేయునాతిశయములను బనిగామిఁ దమమనంబు
లరవీరులై మన్మథాదులు దిరుగంగఁ దిరిగిన కర్పూరతిలక నిన్నుఁ
గలఁచిన కలుపాకకపరవుల్ల్కానఁ దాల్మిఁబడి వెన్నెలలఁబట్టి పట్టిఁసుక్క
తపమున నీకు మోహపుదేవి కాఁగోరి చనితపోవనిఁ గణ్వమునికి మ్రొక్క
యనుమతికి డాయ నివి మాయ లవనిఁ బుట్టు, మని శపించిన నతఁడు దే...
శాపమిది నీతపఃఫలరూప మబల, బ్రదుకుమనఁ జేరెఁ జెలిపిందు వెదకికొనుచు. 50

క. చేరిన చెలులకుఁ జేరువ, నాబుషినిర్మించిచూపి యాదెకంటిరె క
ర్పూరతరువాటి మీక, ర్పూరతిలక యచటఁ బుట్టఁ బొందని యనిచెన్. 51

చ. అనిచిన సార్వభౌజలపదాదిసఖీశత మోమపాత్మ యీ
వనితకు గోరుచుట్టిపయి వచ్చిన రోఁకటిపోటు తప్పెఁబో
మ్మనుటయ కాక రక్షకుఁడవైతి గదా యని పోవుచుం జామీ
మన కెదురయ్యె నేననిన మాటకుఁ బొంగె లతాంగియుం మదిన్. 52

క. భూమండలేశ గగనస, రోమహిమకు మున్నువచ్చిరో రారాకతల్
దా మెఱుక చేసి కొనరవి, యెమో యిట్టగునో కంటిమేయని వారున్. 53

కవిరాజవిరాజితము.

అటు లపు డచ్చున లచ్చెలితోఁ జని యక్కడ నెప్పిన నీసురరా
జట కవిరాజవిరాజితధోరిణియక్కవళాకర హైత్యసము

త్రుటన చఱున్నను జూడఁ గవచ్చుచుఁ ద్రోవన తావిని పొమ్మిఁకమే
లిటు లగు టొప్పన నప్పెనితోఁ జనియె న్మునిపాలికిఁ గామినియున్. 54

క. మునిరాజు తనమనోవీ, థుణచేయుటఁ జేసి మానసంబగునమ్మో
హానవనమున నొకకపురపు, టనఁటి మొనల నుండెఁ బెనుబయల్గల నీడన్. 55

ఉ. చూచె వనీవిభూతి యొడసొచ్చిన నిద్దుర కన్నమూయను
న్నేచె మెఱుంగు లెల్లెడల నింపఁ దళుక్కనఁ దోఁచి మాయమై
తోఁచె సఖీసకాశరుచిఁ దొయ్యలి యమ్ముని మూవలింపఁగా
మోచె సమీపపుంగదళి మోహనగర్భము మెచ్చనచ్చరల్. 56

తరల. మరునితూపునుబోని నెచ్చెలి మాయమైనపు డచ్చరల్
తరళముల్తమప్రాణము ల్వదిలంబుగాఁ గనఁబట్టఁగా
వెరవుపేరని నిల్పుఁబ్రాసిన వేలుపైనను నేర్పునే
మరలఁదెచ్చినయట్టు లమ్ముని ప్రాణఁజూపిన మెచ్చరే. 57

మ. అటు లాశ్చర్యపుమెచ్చుచో నతనిరంభాదప్రశంసార్హమా
ఘటనం గొల్చుచుఁ దద్విశాలవలయాకారస్ఫురద్భ్యాగుహా
చ్ఛటపై బారలు సాచు దీర్ఘవిపులాజస్రచ్ఛదశ్రేణిచేఁ
బటపుంబందిరి వెట్టికొన్న వనరంభం జూచి వర్ణించుచున్ 58

క. అప్పా కపురపు దుమ్మా, యప్పాండిమ కాక నీకుమది నలుగుదువే
యప్పాడిగఁ జెలికిచ్చిన, యప్పా భరమెత్తె నిది మదంబా రంభా. 59

క. అనియాపేరును గడుపున, మినమిన మన మంచిరాచ మెచ్చులపేరుం
గనఁ దగువావులఁ బేర్కొని, మునివనసౌభాగ్యమహిమమును గని మఱియున్. 60

క. వని కిట్టి సిరియె కాఁగల, పనికై చెలి కపురపు టప్పపాటు గదురవే
యనఁటి కిటు దివ్యగర్భమె, మునిమహిమకుఁ జేతులెత్తి మ్రొక్కెద మనఁగన్ 61

సీ. కపురంపుఁ బలుకులు గలగలరాలుట క్రొత్త చిట్టుములు రక్కొనుట నెఱపఁ
బయిపాటుగా డిగ్గు పవనాంకురంబులు బహలికర్పూరార్పుల బాగు మోప
వలపాని వ్రాలిన యెలదేఁటి వాచవి కందిన మనుజెల్లయంద మొంద
నిలిచిన నిలుకడ చలువచప్పరములో ముని యున్కిఁ బవళింపకునికిఁ దెలుపఁ
దొమ్మిదిమువొూర్తములు మోచెఁ గమ్మకదళి, గర్భమూమీఁదఁ బైపొరల్గలయ విరిసెఁ
బుట్టె నొక పుట్టుఁగపురంపుబొట్టు బిడ్డ, క్రొమ్మెఱుఁగు చెక్కి చేసిన బొమ్మవోలె.

క. కన్నకడు పప్పుడు రంభకు, మన్నఁవనముఁ దిన్నఁదనము నాల్గ్కొలిపెఁ దగం

జిహ్వపసు చున్నరంభకుఁ, జెన్నారఁగ ముద్దునచ్చి చేతికి నచ్చెన్. 63

సీ. ఆరంభయలమంగ నంపంపుఁజెయి సాచి గిలిగింత లలచంద్రకళకుఁ గొలుపు
నాచంద్రకళ వ్రంగి యమృతమొల్కఁగఁ బల్కి చెవులపండువు లూర్వసికి గడించు
నాయూర్వసి కరంగి యడుగుఁదామరఁదాల్చి చికిలివేడుకలు మేనకకునడపు
నామేనక చెలంగ నదటుఁజూపులు వన్ని కనుబండువులు వరూథినికిఁబెనుచు
నిన్ను నే శిల్పి కల్పించెఁ జిన్నిమెఱుఁగు, గమ్మఁదావులనీరంభ కడుపుసొచ్చి
యనఁగ నల్లనిగో నని మునికటాక్షు, మచ్చరలకెల్లఁ జూపు నయ్యానుఁగుబొమ్మ. 64

గీ. పాడము ప్రాయంబుశకునంబునడుము ద్రొక్క, వెడలు బాల్యంబుజడిసినడుము ద్రొక్క
నమ్మముద్దాడ నడుమిొద్దెనమ్మయనుచు, నెత్తిముద్దాడెఁ జెలిచెల్వనిలకుడించి. 65

వ. అయ్యవసరంబున. 66

మ. దశమైకాదశలగ్నవేళలనుమీఁదంగల్పెఁ డక్కన్యకుం
దశమైకాదశవాసరోత్సవము లుద్వాహాదులుం జేయునాఁ
డుశతానందసమానుఁ డమ్మఘువువీడుం బోలెఁ బొల్పొందసౌ
ధశతభ్రాజితసర్వవస్తువుల నుద్యానంబుఁ జేసెన్నృపా. 67

క. ఒకయిలు విలసిలు నైవా, హికమై యతికనకమై యనేకమణీక
ర్మకమై సకలకళుద్భా, మకమై తీరై సుధర్మమారై యెందున్. 68

వ. అది యట్లుండె ననంతరంబ యమ్మౌని యనుజ్ఞ నచ్చర లచ్చెలువకు నభ్యంగమజ్జనాద్యుపచారంబు లాచరించువారై నలయువస్తువులు మేడకుం జని తెచ్చిరందు. 69

సీ. నలుఁగు వెట్ట నురంబునకుఁ బూపచన్నులు బలిసిక్రిక్కిఱియఁ జే వెలలపుడు
సిరసంటికొన గోళ్ళఁ జిక్కువాపిన కురులొక్కనలు సాగిన బారఁ గొలువ దపుడు
గంధామలకమిషఁ గదలింపఁ దొడవులు తిరుగఁ బుట్టఁగఁ దివ్వఁదీఱ దపుడు
కట్ట మేనహిమోదకంబార్చి మడుగులు పొడవుదోఁచినఁ దాల్పఁబోల దపుడు
చాలు ననుచు సరససమయోచితోక్తులు, జరపి యుచితవిధులు చలిపి చెలులు
తను నలంకరింప దశమలగ్నమునకు, నిండు జవ్వనమున నిలిచె బాల. 70

గీ. కురులు గూడి ఘనోదయస్ఫురణ చూప, స్తనిత మయ్యె నురస్తటం బనఁగ నేల
పాము వ్రేలాడఁగట్టినపగిది మెఱసె, రమణి నూగారు శృంగారరసము గురియ. 71

గీ. మోము చందమామతో మంచిమాటకుఁ, దమ్మిలనుప నేకతమున కున్న
రాయబారితామరలనంగఁ జెవిచెంత, వల్లఁజేరి కన్ను లమరెఁ జెలికి. 72

మ. అప్పుడా చెల్వయు రాకఁ గంటి మొకటా కాశ్చర్యసంపాదినై
చపలాక్షీహృదయంబుల న్నిలిచె రాజా నిక్క మా చిన్ని ప్రా
యపుఁ జేఁజన్నులమీఁది యాఋషిక యే యాసొమ్ములే యట్టిభా
రపుఁ బాలిండ్లకు నిండుమేనికిని బర్యాప్తంబు లైయుండెనే. 73

వ. అట్లగుట యభ్యాసంబు గాఁడ వెండియు. 74

ఉ. జవ్వని చెక్కులు న్మెఱుఁగుఁ జన్నులఁ బయ్యెద జాఱు దిక్కులు
న్నవ్వు పసొమ్ముపై మణిఘృణం బగు చక్కఁదమ్ముఁ జూచి తా
రవ్వలుసీదు గా మనిన యన్నిక సౌందరియఁ జూచి రేలొకో
యువ్వనవాసి వెట్టఁ దజుఁడిప్పుడ సృష్టికి నంచు నెంచుచున్. 75

—లయగ్రాహి—

అప్సరలు వేడుకయు నచ్చెరువుఁ జిత్తములఁ జొచ్చి యెడఁ బాయకొక నెచ్చెలులు జోడై
పెచ్చుపెరుఁగంగఁ జనియచ్చటికిఁ గొలంకులను ముచ్చటఁ దలఁగ్గడిగి వచ్చిరి యనుష్ఠా
నోచ్చలితుఁ డైన ముని యచ్చరితముల్ దెస వచ్చఁబురుడున్ వెడలినచ్చెఁ గ్రియలన్నా
ప్రచ్చనటమీఁదితగవచ్చు పడఁగా మొదలి యచ్చెల పవేరయపుడిచ్చినటు లుండెన్. 76

వ. అట్టి సమయంబున రంభాసంభసంజేరి. 77

సీ. వెన్నెలబయలు పూఁపిలుకొని యాటకుఁ జిగురాకుబోఁడి నీ చిన్నినగవు
దలివల్లభనివిహారమునకు లేఁదోఁట మెలఁతనీకనుదీఁగ మెఱుఁగుఁజాలు
చప్పగ దాఁగు వింతలకుఁ జీఁకటిమేవ మగువనీ వేనలి జిగిబెడంగు
తామరకొలను కందమ్మని యోలకు వనితనీ వదన లావణ్యరసము
పెక్కులేల మగల ముక్కంటి దయకల్లి, కమ్మకత్తి మనసుఁ గన్నపెట్టు
గంటుదొంగ దెప్పుడుఁ గరుప్పరతిలకనీ, తీవి మేను వెంకి మానిమ్రాను. 78

ఉ. ఇచ్చట మేని నాఁడు నదయాడుదు గో తనయందు నన్న యా
మచ్చిగఁ బాయలేక నభమానఘనయ్య నితంబమయ్యె నా
నెచ్చెలి యూయలాటలను నీవగుపాపము సోఁక నెయ్యమై
యిచ్చఁ బదీయ బుద్ధికిలదా తరువాతఁ బలిప్రవృత్తికిన్. 79

వ. అనిపలుకుచు నవసరంబున. 80

శా. కన్నాని మోసులుం దలిచెఁ గిగ్గిన కానులు పాలుఁ గన్నులు
న్నిన్నులు నల దేఁ బొన్నులఁగ నెచ్చెకన్నులు దేఁబిడ్డని జా

జుమ్మను కొప్పులు న్నపలు చొప్పులు నొప్పఁగ నాదగింపఁగా
రమ్మని పిల్వవచ్చి రుచురాణ్ముఖిఁ గొంపటు బోనకత్తియల్. 81

ఉ. వచ్చిన నెచ్చటన్మొలచి వచ్చితిరే యన నోలలాడుచు
న్వచ్చితిమమ్మ యేము నొకవారిరుహాకరవీథి నీజటా
భృచ్ఛతురాననందు మొలపింపఁగఁ దమ్ములతోడఁ బుట్టిమా
కిచ్చె సుగంధగంధి పవహీరకిరీటము లబ్జనామముల్. 82

సీ. అనవిని యచ్చరల్మునిరాజునకు మ్రొక్కి యయ్యనిన్నటఁగోలె ననుఁగుబిడ్డ
చెంతవాయక యుంటి రింతలో నీసృష్టి సాగుటెక్కడయును జూడఁగాను
కులకటువోదు రేకోలనుసొచ్చియె తెచ్చికొంటిరి నెఱజాణ కొమరుఁగొంపు
ఘనసారతతికి నిచ్చిన తేజమింద్రాణి మెచ్చుసుమ్మన నతండిచ్చగించి
అరసి కన్నియ నాకొంటి వారగింప, నరుగు మిది మాకు మాధ్యాహ్నికావసరము
పోయివచ్చెదమనఁ జిన్నిపువు నమర్చె, నతనికిఁ దదాజ్ఞమాకు జోహారునడపె. 83

చ. అపుడట నుండి యేను గుతుకాగతమానులు గణ్యతాపసా
లపనమనోనుకూలవిధులన్ బలుదీవన లిచ్చియంచిరం
గపురపుబొట్టుభామ చెలికత్తియ లౌనన మేడకేగుడు
న్విపులరసంబులై వలచె విందులు చిందుచు రెండుపూఁటలన్. 84

సీ. కమలగంధిపయోజగంధిపంకజగంధు లానందసన్నాహ మచ్చుపంపఁ
శాఖోరుహాసుగంధిపద్మసుగంధులు ఘనసముల్లసనంబుఁ గడలుకొలుపఁ
గంజగంధిసరోజగంధిసారసగంధు లుపచితంబైతపం బొనరఁ జేయ
సరసిరుహాసుగంధిజలజసుగంధులు సుసరమై సుషిరంబు సొగియఁ దేల
వపురపాంగ వేణీవిభావలయవీథిఁ, గనదనిర్వార్యమూతిఁగ్నై వనజగంధి
ముప్వేలుఁగులోని పరతత్త్వమోయనంగ, శుద్ధనాట్యంపుఁ దెరువునఁ జూప్యబోలిచె.

ఉ. కంచియదోయి మూఁపులకుఁ గోపులకున్నెతిచూప జోఁటిజో
డంచు లలంకరింప గుజ్జుతైన కిరీటము వెట్టి జక్కణీ
సంచున కబ్జగంధి జలజాతసుగంధి మణీమయక్రియ
గ్గాంచినఁబుట్టఁ బుట్టెఁ దెలుకల్నెఱపెం గొఱవంజి యాటలల్. 86

క. పేరోలగముతలంపుల, పారంబులు వలికి యులికి పడఁజేయుచు నొం
డే రెండెయు నెడ నిన్నిక, నీరాకరుఁ బకు మొంచి నెచ్చెలి గలఁచెన్. 87

చ. పగతురు నెయ్యురు న్బిరుదుపాటలలోఁ గణింపఁ గేకసున్
సిగసిరసూచెఁ గత్తి మొనచిమ్మను గుమ్మను నేలసోఁకుచు
న్నెగయఁగఁ జొక్కుటాటలకు నేరిచి నీరజగంధిదాపలై
జిగిజిగి మాపురా నెడమచేతన మీసము దువ్వెఁ జిందునన్. 88

గీ. చెలువ కొలువంజి యొలుకఁ జేఁజిన్నవోయి, చిన్నవగనైన నగదయ్యెఁ జింతగొనఁగఁ
గొరజగొమ్మ బరిగత్తి గొకి మీస, లారజపుఁగేక బోఁటికి నమరెనపుడు. 89

వ. అంత భవదీయ రూపరేఖాతిశయంబులు మనంబునం దలంచితలంచి లతాంతశరంత
కుంతాధీన స్వాంతయగు కాంతంజూచి చింతించుచుఁ జంద్రకళాదు లుద్యానవనవి
హారంబులఁ బరాకు సేయం దలంచి తోఁకొనిపోయి. 90

క. రాచిలుక రాణివాసము, లోఁ జెలి యొలమావి చిన్నియుప్పరిగలపైఁ
జూచితె మునగనలానుచుఁ, జూచెద రాతలిరు టెంకపుసోరణగండ్లన్. 91

చ. చిలువలఁ బొంచి చంచువులఁ జించు భవన్నవరోమరాజిసా
టులకివి వచ్చు టేలని యొటో కబరీసమతాభిలాషి ని
ర్మలనిజబర్హపఙ్క్తియపరాధము గా చెనుగానఁ జూడుమో
లలన శిఖావళావళి హళాహళి కన్నులపండు వయ్యెడున్. 92

క. ఈవిధమున సుమశరశర, ధావనగళదాత్మసత్త్వధైర్యఁ గనిపని
భూవిహరణకైతవగతి, భావము మఱపుత్త్వమనుచు భానులుసనఁగన్. 93

ఉ. గబ్బునుదంబునందము పికాలి పికాలి శుకాలి అంతులా
గుబ్బులు రేఁగఁ బుష్పాదులు గొబ్బున జుబ్బవ రాలుచుండఁగా
మబ్బున గుజ్జుఁ గెంజిగురు మావిడిచూచి చలించె గబ్బిలే
గుబ్బెత కంతుచే బిరుసుఁ గ్రోవి రవుల్కొనెనంచు నయ్యెడన్. 94

క. చిలుక యొకటి యతిరయమున, నెలమామిడి చిగురుఁ గొమ్మ యెక్కెంజెలిగాఁ
బొలిచెం గెలిచితిగెలిచితి, గెలిచితినని పలికి కలికి కిలకిలనవ్వెన్. 95

క. ఆసమయంబున మకరం, దాసవరసపాన మదపదళినీగానా
భ్యాసవిశేషనిరంతరి, తాసహ్యాశ బధిరస్మృతి కాస్పదమయ్యెన్. 96

వ. ఆయ్యవసరంబున. 97

చ. వడిఁ జనఁ జూచి యాత్రఁ బనివారణఁ దాఁపు నిశాటకోటులున్
మడియఁగ మీఁదట నెత్తుట సముద్రముఁ దోఁచినో నింగినాఁగ న
స్పాతు కనునట్లు నస్తగిరిస్వామి నెలంగులు శోఁణ[illegible]

ల్లైన నరుణంబులై కనదహీనవిభాతతు లాకసంబునన్. 98

క. రక్షోవీరుల నట సమ, రక్షోణిం జంపి నిజకరకృపాణాస్ర
క్రవ్యాశనమునను జగ, చ్చక్షువు చనియె నన నపరజలనిధిఁ జేరెన్. 99

గీ. సోముఁ డేగుదేఱ యామినీకామిని, తన్నలంకరింపఁ దలఁచి లేచి
చిక్కువాపవచ్చు చికురబంధం బన, నిండెఁ దమము కమలజాండపుటము. 100

వ. ఇప్పగిది జారిణీజారచోరవారమానసకాలుష్యంబు వెల్లివిరిసి యజాండకరండంబు
నిండు చందంబునం దమస్సముదయంబు లుదయంబునొందు సమయంబున. 101

సీ. పూర్వదిగీశగంధర్వమహాళిఁ దనర్చు పికిలిపూవుఁదలాటమొక్కొ యనంగఁ
బొడుపుగుబ్బలిరాచకొడుకు చుట్టినయట్టి నలిపచందురుకావిపాగ యనఁగ
దర్పకజైత్రయాత్రావార్తఁ జైత్రుఁ డగ్గడిఁ జాటు తలిరు జేగంటయనఁగఁ
జిన్నిరేప్రోయాలు వెన్నెలప్రాలు జల్లించు బంగరవు జల్లెడ యనంగ
నంతఁ దోఁచెఁ గతిపయప్రయాణానుగాం, భోనిధానవిదితమానసాను
రాగ సూచకాహిరాట్ఫణామణిమహో, వహనసహనవీచి తుహినరోచి. 102

వ. అంతనంతకంతకుం బొడవై పొడవై పొడవై పుడం బొంకం బనుమృగాంకంబు యా
మినీకామినీ పురాతనవిరహిసమయ విషమశరప్రసవమార్గణవర్గక్షతమార్గనిర్గళ దనర్గ
ళరుధిరధారాపూరంబు తోరంబుగా నంటం బడనేది ఘనీభవించునలుపున నలుపు
దెలుపు రాజు విరాజమానమూర్తియై గగనవీథిం జనునప్పుడు. 103

క. సలసలఁ దెరలు విరహిహృ, త్కలిలంబులు చలి పిసికి చవిచూచుచు వె
న్నెలపిండి యొక చకోరిక, కులుకుచు నొకకజ్జ మగనిఁ గుడువంజేసెన్. 104

—* లయగ్రాహి. *—

కోరితొనవిందు దనకోరి జిగియాక చనకోరియని చేరెడు చకోరియు లతాళ్యం
గారములు దేటిడు నగారములు కృత్రిమనగారములు కేకినయగారములునుం గా
సారములు జేమరకసారములు పుష్పరససారములు మాగభుజసారములు ఘోరా
కారములుదాల్చుసహకారములు తేఁటులప్రకారములు బోఁటికివికారములు సేఁచెన్.

సీ. అధికచంద్రాతపవ్యథకుఁగా కిరుకేలఁ బయ్యెదఁ దురముపైఁ బట్టుకొనుచు
వర్త్మవల్లీప్రసవములు మెట్టుటకుఁగా కడుగుఁదమ్ములకడ ల్దడవికొనుచుఁ
గటుకోకిలార్భకారభటికిఁ గాక తటానఁ జెవులలోఁ దర్జనుల్ చెక్కికొనుచు
మలయగంధిలమంద మరుదాగతికిఁ గాక చెలికత్తియలఁ జాటుచేసికొనుచు
నవ్య లోలుకుమురుని నిశితహేతులవోని, చిగురుసగములు చూచి దిగులుపడుచుఁ

## తృతీయాశ్వాసము

జేజేలకొలఁకుఁజూపె సింగారిపూఁదోఁట, నాటవెలఁదియోట తేటపడఁగ.

క. ముదిరిన రేయెండలచే, నెద వడదాఁకఁగఁ గొమ్మయొదవడఁ జొచ్చెం
జదురు న్మాటలఁ బట్టెడు, పదరేటికిఁ గొలుపనింకఁ బదరే యనుచున్.

చ. ఉపవనభూమి నిప్పగిది నొయ్యనొయ్యనఁ జేరఁ గేలిస
ల్లాపగిదిఁ జంపకాదిసుమభూమిరుహాగత శీతవాతధూ
తాదవశాత్కృనత్ననలతాస్థితిఁ జూడఁగ నోడి నెచ్చెలు
ల్క్లిప్తపు వేది నెక్కెయెడఁ గామిని నుంచి యనంగుదూఱుచున్.

గీ. ముంటఁ బూవుఁదెచ్చి మొనసూపు నామని, కంటఁ గానరాక కాముఁడేసె
నీడ తెల్లఁగాఁగ నెఱగాని వెన్నెల, జాడ నల్లఁబడఁగఁ జనియె గాడ్పు.

ఉ. హాలహలంబు ద్రింగ శశి నాదటఁ దాల్చెఁ బ్రసూనబాణునిం
గాలుని ప్రోలి కంచెఁ జలిగాలి భుజంగమభూషకోరలం
గూలఁగఁ ద్రోచె నీశ్వరుఁ డకుంఠితదివ్యవిభూతిపేర్మి నా
ఫాలవిలోచనుం దలఁపు పంకజలోచన నీవునావుడున్.

చ. కుసుమశరంబు లెండు నళినాజ్ఞఁగినీరము రెండు దండుసా
గసబిసరాజి నాఁజని భరంపడి తెచ్చిన శైత్యకృత్యము
ల్వెస వెసఁ జేయఁజేయ నవివేఁడిమి పోడిమి నంతకంతకున్
బసమరఁ జేయ నిందుముఖి వావిరిఁ బల్కు మనోభవాదులన్.

గీ. నీకు వెఱవికాదె లోకవిధ్వంసక, మగని కొమ్మువిడిచి డిగఁగ వెఱచు
గన్నతల్లి కుసుమకార్ముక నీవింకఁ, బాంధజనుల భంగపఱచుటరుదె.

చ. మము వెఱవారిఁ బల్వురఁ గ్రమంబునఁ జెప్పఁగ నేల యక్కటా
సుమశర మాధవాదు లగుజోదులఁ గూడి జగత్త్రయంబునుం
గమరుపఁ జూచి కాదె కలకాలపుబాధఁ దరింపఁ జాలమిం
గములజూరాణి వల్లభుమొగంబున వ్రేలునహర్నిశంబులున్.

క. మ్రొక్కొకటి కలదె నీకుం, దొట్టినమదమునఁ దపోధనుఁ బరాశరుని
న్నట్టేటఁ బుట్టి ముంపవె, కట్టా కందర్ప కుసుమకాండముల నడిన్.

చ. తుహినమయూఖ నీవుతలఁ ద్రొక్కి వశింపఁగఁ గాదె భీతిఁ జెం
దిహిమధరాధరాత్మజకు దేహములోన సగంబు గాఁగఁ దా
బహుమతి సేయఁగాఁ దలఁచె ఫాలవిలోచనుఁ డెవ్వరింక ని
న్నహహ తరించువారు వనజాక్షులఁ జేలలఁ జెప్ప నేటికిన్.

చ. పవపడి నిన్ను శీతకర పాపకముఖ్యులు దూషితొత్తులై.

చిచిమి మెసంగు వేళఁ దరిఁజేరుటమానవు లోకబాంధవా
భ్యుదయము నూచి వెల్లనయి పోయెదు నీవిటఁ బాంధకోటినా
పదఁ గుదియంగఁ జేయునది పౌరుషరేఖ యటంచు నెంచవే. 116

ఉ. మందుఁడ వయ్యు లోకజనమాన్యుఁడ వీవని నమ్మియుండఁగా
మందసమీర యిప్పగిది మారుఁడు తోడుగ వేలనంటినం
గందు సతీతనూలతను గ్రాచుట నీకొక పౌరుషంబె నీ
మందగుణంబు నెన్నటికి మానకపోవుర నిర్దయాత్మకా. 117

వ. అనునంత. 118

గీ. తమ్మివిరిదాయ యున్మత్తుఁడమ్మ మధువు, కుటిలుఁడోయమ్మపవనుండు క్రూరుఁడమ్మ
మదనుఁడెదయుఁడు గదవమ్మమానుమమ్మ, ప్రార్థనలు సేయగదవమ్మ బ్రదుకుమమ్మ.

గీ. పాడిగలమారుఁ డాపాటి బాలమేను, చెమరుచేముంచి కొంతరక్షించెఁ గాక
తత్ప్రసవబాణశిఖిశిఖ ల్తలుమునపుడు, మనలకన్నీరు పన్నీరు మాన్పఁగలదె. 120

క. కనుపించిన విలువంచియు, దొననుంచిన యమ్ములెత్తి తొడనేర్చియు నీ
కనుచితముగాదె యబలా, జనములఁ గనుమొఱఁగి యేయ శంబరదాయా. 121

క. ఇందమని యిందమనుముని, కందర్పప్రవరుభీతిఁ గడతేర్పక మా
యిందుముఖికి నీకృపయును, మందసమీరా సుగంధమందసమీరా. 122

క. ఇత్తెఱవ చిక్కెఁ జిత్తజు, కత్తులబోనం బరోపకారము కొఱకై
యెత్తితివిదె నీదేహము, చిత్తమునం దుంచుమయ్య శీతమయూఖా. 123

ఉ. మందసమీర సైంధవ యమందమరంద ఝరీపరీత మా
కందపుటీవిలాస గిరికందర మందిరకేళిలోల యిం
దిందిరసార్వభౌమ యళిదేవ మిళిందపురందరా పరా
కొందక కావు నీలకచ యున్నది నీవల జిక్కమాటునన్. 124

వ. అని యమ్మందగమన లందఱు నందంద కందుచుఁ గుందుచు నిందుకందర్ప మందానిలాదుల ననవరతమరందబిందుకుందేందీవరారవిందచందన సందోహసంపాద్యపాద్యాద్యుపచారంబులంబూజించి హెచ్చరించి యచ్చంచరీకాంచితకేశపాశ కాశాపూర్తిఁ దత్ప్రసాదాసాదితంబుగా నక్కునందార్చియుం జెక్కునం జేర్చియుఁ గన్నులనొత్తియుం జన్నులమెత్తియు హస్తంబులం దుడిచియు మస్తంబున న్మడిచియు నుపచరించు నట్టులై యుండిరి. 125

ఉ. ఇంతను నెంతకాఁగలదొ యోఁజనుదేఱకమున్న చిత్తభూ
చింతఁ జిగిర్చి రేఁబవలుఁ జెక్కులపైఁ బులకాంకురంబులై

కాంతకుఁ దోఁచెఁ బెంజెమట కాలము పెంపున కేమిసందియం
బింత యెఱింగి యుండు మిఁకఁ నేమటవత్తుము పెండ్లినాఁటికిన్. 126

వ. జన్మాంతరంబు లెత్తినను భవత్సంయోగంబ కావలయునని యభిలషించియున్న యక్కన్నియం బరిగ్రహించుట యుచితంబు. అదియునుంగాక యన్మహానుభావుం డగు కణ్వముని యనుంగుంబట్టిఁ గాఁ జేపట్టినకతంబునఁ బరిగ్రహించుటయ యుచితంబు. 127

సీ. అని యొప్పఁజెప్పి యమ్మనుకుమారుని నాసుకుమారుఁ దోకొని సురతపస్వి
దేవేంద్రుననుమతిఁ దెచ్చి మాతలియిడ్డ యరద మెక్కి యయోధ్యకరిగె మదన
జయశంఖ మానందముఁ జదివె హేమాచంద్ర కళలకు మున్నాడి కదలివచ్చె
తెల్లదేఁటి యొకండు దెలిసితి మునిసృష్టిగా దాని నదియును గదఁక నట్లు
పలికి ఝంకరించె బలభేది కేలెత్తి, నయభయములు సూపె నరవరునకు
వచ్చియచ్చరలును వజ్రికిఁ గర్పూర తిలక తెఱఁగు మ్రొక్కి తెలిపిరపుడు. 128

శా. ఆమాటల్విని రాజుఁ జూచి జయశంఖాలాపచాతుర్యమున్
హేమాచంద్రకళావచోరసము నీకెట్లుండె నన్నారదుం
డేమీ బొంకెనె యింక వీరిఁ గొనిపొమ్మేనత్తు వైవాహిక
శ్రీమాధుర్యము సూపరేప యని యంచెన్వజ్రి భూవల్లభున్. 129

మాలిని—అనిచిన నతిలోకుం డానతుండై బలారా
త్యనుమతి ననుఁగై రానంబు భూశంఖభృంగం
బన తనుభయమాలిన్యాశయం బింతికిమ్మం
చనునయమయమై రానచ్చర ల్మెచ్చఁటాహన్. 130

మ. తన తేరెక్కి చనంగ నందనవనాంతః కంతుసైన్యంబు భో
రన ప్రోయంగను తన్మనశ్శ్రవణ మూర్ఛత్తెల్చినత్తోఁటఁ జ
ల్లనిమందు ల్గొనివచ్చి చంద్రకళ తెల్పం దేఁటివారించె న
మ్మొనలంతు ల్వరుసన్ బ్రతిస్మరమును ల్మోమైన మూఁడానలన్. 131

వ. అంత నచ్చరలప్పలం జనునప్పుడు భూవిభుం జూచి. 132

క. అదె లీలావతి యూర్వసి, యదె యల్లదె రంభ మనోరక్షైకాగమ సం
పద చూచిచూచి పెసఁబో, యెద రీతి నాతువాగ్ల యింతికిఁ దెలుపన్ 133

క. అనునప్పుడు బదరీవన, మునఁబాంతం గణ్వమునితపోభూమి దన
స్సనవిల్లు లెంకసాఁ, ఘృనిరూఢిం దేరునిల్పె నచ్చరలంతిన్. 134

గీ. కతలు పదలి నచ్చిన దండ లాసఁగింగఁ, దేరు డిగ్గి రాజు తేఁటిపోయెఁ

దెలిసి వచ్చి వేళ తెలుపంగఁ జని కణ్వ, మునిపదంబు మకుటమున భజించె. 135

వ. అమ్మహర్షియు నాదరించి విధేయంబగు నాతిథేయంబు సలిపి సమాసీనుండైన యజ్జ
గతీజగదీశ్వరునీక్షించి. 136

మానిని—కోపము కాదుగదా యొకకోపునఁ గూఁతలుఁ గూసె మహీశ మనో
భూపరివారపరంపర మేదువుపొంతన తావకచిత్తమియ
త్తాపరిమేయమహోన్నతి నత్తఱి నత్తెఱఁగై యిఁక మానినికిం
జేపడఁ జంతకు నూతఁగ నూతనచేష్టితమే మఱుఁ జేయుటకున్. 137

చ. అనిమునిరాజు రాజు హృదయంబున కింపొనరించి సన్నఁగాఁ
దనుఁ గనుఁగొన్న నయ్యురుపదంబులఁ గంతుని గెల్పుముట్టు వే
చని చెవిచెంత సంకుచిత ఝంకృతినూకొని విప్పు టెక్కులా
య్యె నిలిపియాడుచుం దపసియాడిన మాటలకాత్మఁ బొంగుచున్. 138

గీ. మనుకుమారుఁ జూచి జననాథ యంపించు, కొనుమనంగ నతఁడు మునికి నెరఁగి
దీవనలు వరించి తా వేడ్కతోవచ్చి, యరదమెక్కె నెక్కెనదియు నెగలు. 139

వ. చతుర్ముఖముఖంబున నఖిలలోకశబ్దవాచ్యుం డయ్యెనే యితఁడని మునిరాజనురాగం
బునం దనవాకున నిష్ఠ్యాపనతిశయంబు పునఃపునరాఖ్యాతంబుగాఁ జేయుచుండె న
ది య ట్లుండఁ జంచరీకసారథ్యంబునం బఱచురథంబు విడిదికడ న్నిలిపి. 140

క. డిగి రాజు సారఁగఁ దానుం, దగినంతై నగరు సొచ్చెఁ దద్దివ్యరథం
బగునగు నవరంభాదుల, మగరాయనిఁ గొలువఁ బనివి చుకరమరిగాఁ. 141

వ. అరిగి యనంతరంబ. 142

చ. మదనధనుర్గుణావగుణ మార్గధురంధరమైన తెల్లతు
మ్మెద మదిరాక్షినూపురము మీఁదన టెక్కులతోడి ముత్తియం
బదియన వ్రాలి చెప్పె నరుదండఁగ నచ్చటి మేలువార్తఁ జూ
చెదవిపుడన్నియు న్నృపతి చెంతఁ జెలీ యనుమాట మీటుగన్. 143

ఉ. చెప్పిన తేఁటిఁ గాంచి మునిచెయ్యి మనోజునకు న్సహాయమీ
యప్పచికొండ పుట్టె నకియా యిఁక నోడకుమన్న యన్నులం
దెప్పిరి చూచె నప్పుడొకతీఱునునున్న విరాళి బాలయీ
త్రిప్పలి నన్నుఁ బెట్టెఁ డికఁ దెచ్చు విభున్మరుఁ డంచు వేడుకన్. 144

గీ. అని బహూకరించి యనిచిన నెలదేఁటి, పుడమి తేని విడిదికడకు నరిగి
ప్రొద్దుపుచ్చుచుండె భోజనమునునంత, రమునసిష్టగోష్ఠిఁ బ్రమదమొదవ. 145

వ. అమ్మఱునాఁడు. 146

క. ఉదయమ్మునఁ గల్యాణా, భ్యుదయము గనుఁగొనఁగవచ్చి పురుహూతాదుల్
తెదుపవనహర్మ్యనిర్మల, పదవి న్వసియించి రటకుఁ బ్రమదం బెసఁగన్. 147

క. నెమ్మిఁ జనుదెంచె నృపజా, తమ్ములతో బంధుజనవితానమ్ములతోఁ
దమ్ములతో వివిధపదా, ర్థమ్ములతో నవ్విదర్భక్షితల్లియనుజన్. 148

వ. అఖిలాంతరీపభూపతులును దాపసాగ్రేసరులును జనుదెంచి రంత. 149

క. తలగడిగి దివ్యతరుణీ, తిలకంబులు చెలికి జిలుఁగుఁ జెలిపావడచే
నలకలఁగల తడి యార్చిరి, తిలకము గనుపట్టినపుడు దిద్దినరీతిన్. 150

క. వనరుహలోచన లెల్లరు, మనమున నివ్వెఱఁగు నడరఁగ మణిభూషణచం
దనదివ్యాంబరములమరె, మునిలోకస్వామి కరుణముద్రియ మేనన్. 151

గీ. మనుజనాథుఁ డేగి మంగళస్నానాది, కములు సలిపి భూషణములు దాల్చి
యమరవిభుఁడు సుతుఁడు నఖిలబాంధవులును, సందడింపఁ గణ్యాసదనమునకు. 152

వ. మునివరుండును గర్మపుణ్యాహవాచన మధుపర్కాదికృత్యంబులాచరించె వసిష్ఠాను
మతంబున నమ్మహీమండలాఖండలుం డుద్యద్రత్నపీఠంబుననుండి గుడజీరకంబులు ధ
రించెనట్లు గృహదేవతాసన్నిధానంబున గుడజీరకంబులు ధరించి యున్న కన్నియం దో
తెచ్చి నెచ్చెలులు తదభిముఖంబుగాఁ దెరమాటుగను నుంచి రంత. 153

క. జనవర గుడజీరకములు, మునునిల్పు మునంగ వ్రజిముద్రియ లెత్తి
స్వనజాక్షిమునునిలిపెఁద, క్కనసఖులపుడు విడ గెలిచె గెలిచె ననంగన్. 154

క. రతియును రతిపతియును బలె, క్షితిపతియును సతియునుండఁ జెంతఁ బురంధ్రీ
తతియారాత్రులు దాలిచె, నతులితమణిభాజనముల నంతం బ్రీతిన్. 155

క. మునిధారవోసెఁ జంద్రా, ననఁ గృష్ణార్పణమటంచు నరనాయకయి
స్వనజాతాననఁ బ్రోవుము, మునుకొని ధర్మార్థకామములతోఁ బ్రీతిన్. 156

వ. అనిన నట్లకాకయని పాణిగ్రహణం బాచరించె. 157

ఉ. ఈశుఁడు సర్వమంగళకు నిందిరకున్ మధుసూదనుండు లో
కేశుఁడు వాణికి న్శచికి నింద్రుఁడు గట్టినరీతి న్వసిష్ఠవా
గీశుఁడు నయ్యరుంధతియు నెంతయుఁ బ్రేమనొసంగఁ గట్టెను
ర్వీశశిఖావతంసమణి యింతికి మంగళసూత్ర మయ్యెడన్. 158

సీ. భూకాంతుపిమ్మటఁ బురుహూతముఖ్యులు నంబుజాసన వెన్నసన్నులసలు
జననాయకు సమీపమున వసిష్ఠాదులు కమలలోచన చెంతఁ గణ్యముఖులు
నరనాథు చెంగట నవఖండభూపతుల్ బ్రహ్మచరుంతుల చెంతఁ గనులగంధు
లవనీశుఁ డున్నెడ నఖిలబాంధవులును నటించి పెద్దలు కాంతాంగనలు

నికి చిత్రవర్ణము లాలుపులు జెలువుకొనఁగఁ, బుడమి ఘేకీధణంధణన్నూర్తి మెరయ
జేరుమంగళశ్రీనాదము లొద్దివిఁ జెలంగ, బోరనన్మించెఁ దలఁబ్రాలు వోయునపుడు. 159

వ. అనంతరంబ వేదికారోహణంబును బ్రధానహోమంబును నిర్వర్తించి 160

ఉ. ఆలకు పసిఁడికల్పిత సమంచిత వీచుల నోలలాడున
జ్జలజముల న్హసించుటకుఁ జాలెడు హీరమణీఘృణీస్ఫార
స్వర్ణ మనఘాకృతస్వయము దాల్చినలాజలు వ్రేల్చు భూవిభు
న్నలగొనఁజంచె నగ్నుఁడు వారి జలోచనతోడ వహ్నికిన్. 161

సీ. సప్తపదములండి జనపతి సతిఁజేర్చ, రాజలెమ్ము లెమ్ము రమణి కేను
విన్నవింతు నీకు విన్నపం బంతెయు, ననియె నొకతె యెల్లరును నగంగ. 162

వ. ఇవ్విధంబున నాల్గుదినంబులుం బత్తమచిత్రప్రకారంబుల నడపి చతుర్థాహంబున దే
వతాబలిప్రముఖనిఖిలకృత్యమ్ములు నిర్వర్తించి యమ్మహోత్సవానంతరంబున. 163

గీ. ఆమనవల్లభు వవ్వసిష్ఠాదిమునులఁ, బూజఁ దగఁజేసి దీవించి పుడమి వేని
వెలుల నళికొక్త సప్సరోజలజముఖులఁ, గూర్చి సుతనంచెనమ్మని కుంజరంబు. 164

వ. అనఁగని జనమేజయుం డవ్వలికథాక్రమం బెట్టిదనిన. 165

ఉ. ఫాలదృగగ్నిపృష్ఠ్వలనభాపరిభావి భుజాసి దర్శనో
న్మీలిత సాధ్వసస్థగితనిష్ఠురలోచన వైరివీరభూ
పాలక పాలరక్తరసపానపలాశన తుష్టభూతబే
తాళపరీత భైరవపతత్రిగణమార్గనటచ్ఛటవ్రజా. 166

క. ప్రతిదిన నిజపురయజనా, గతబృందారకవితానకరుణా పూరా
ర్జితమహితాశీర్వాదా, వితవితరణగుణమణీ నవీనపయోధీ. 167

సుగంధి- వారిజాక్ష సత్కటాక్ష వర్ధమానవైభవా
సారసారసారిసారచంద్రకాల సద్యశః
పూరపూరితాంతరిపభూపవీరమానసా
గారభూనటత్త్రపతాపగర్వితారిభంజనా. 168




ఇది శ్రీమత్తిరుమల తోడప్పాచార్య చరణసరసీరుహ సేవాసమాలబ్ధ సామ్రా
జ్యధౌరేయ నిజకార్యాఖరణాయమాన యెల్లభూపురందరవరనం
దన మల్లనంతమహీనాథప్రణీతంబైన కకుత్స్థవిజయం బను
మహాప్రబంధంబునం దృతీయాశ్వాసము.



లోకవార్తలు దెల్పపాకారివచ్చుట యతిలోకుఁ డని ధాత యనుటపిదపఁ
గణ్వమౌని యాజ్ఞఁ గర్వరతిలకవు, నాథుఁడగుట నిఖిలనరపతులకు
విస్తరించి చెప్పి విభునిదీవించి ని, జేచ్ఛఁ దపసి యొక్కడేనిఁ జనియె. 7

ఉ. ఈగతినిల్లునించుకొని యించుకసే పటులుండ భానుఁ డ
స్తాగము దాఁటెఁ జీఁకటులజాండకరండము నిండె నిండిన
నాగగణంబుఁ దోలుమృగనాయకసంఘమువోలె వెన్నెల
లుబ్బగగనాంతరాళములఁ బొంగ సుధాకరుఁ డొప్పెఁ దూర్పునన్. 8

క. వనరుహలోచన చక్కం, దనమునఁ దనమనము మఱఁచువరవీడఁగమ
జ్జనభోజనములు దీర్చి, జనపతి చనుదెంచెఁ గేళిసదనంబునకున్. 9

సీ. అవలించి పిల్చు నయ్యంబుజాక్షులు కొంద ఱారిగద్దిగతనం బనుకరింప
గారవించుచుఁ బిల్చు కమలలోచన లెల్ల మావఁతుబలఁగంబు మాడ్కిఁ దనర
మాటికి మొనసూపుమకరధ్వజుఁడు కోలిగడవాని కైవడికాంక్ష సేయ
నమ్మైననడనీక యాఁకవెట్టినసిగ్గు సంపూర్ణమదధార సరణిఁ బొదలఁ
కటితటీకోటికింకిణీకారవంబు, పార్శ్వఘంటాద్వయీనాదపదవిఁ బొదువఁ
దరళలోచన గంధసింధురము పగిదిఁ, గొంతసొంపునఁదోతెంచెఁ గాంతుకడకు. 10

వ. ఇవ్విధంబునం జనుదెంచి తలవంచికొని యున్న యక్కాంత నక్కాంతలాననంబునఁ జిఱునవ్వులు దొలుకఁ దనకుం గనుసన్నలనప్పగించుచుఁ గార్యాంతరంబులు కల్పించుకొని చనునప్పుడు. 11

చ. చెనకనుపక్రమించుఁబతి చెంతఁదొలంగఁగఁజూచు నాతి య
వ్వనితఁ బరాకుసేయు జనవల్లభుఁ డుల్లముభీతినూనుమా
నిని యిటుకొంతసేపు ధరణీపది తాఁదననేర్పు నాతినే
ర్పును గని నవ్వె నవ్విన సరోరుహలోచన నవ్వె నవ్వినన్. 12

గీ. అంతఁ గొంతభయముపశాంతమైన, లోలలోచన బాగాలు కేలికొసఁగ
మడుపొసఁగఁబోవు నెపమున మనుజవిభుఁడు, చేతఁజెయిపట్టి శయ్యపైఁ జేర్చిపలికె.

క. నీవీవిభవంబిమ్మని, భావించిన నాకుఁ దాఁచఁబాడియె యనుచుం
గావించిన సరసోక్తుల, భావము గరఁగించి మఱియుఁ బైపైనంతన్. 14

ఉ. పయ్యెద జాఱఁజేయఁ గరపంకరుహంబులఁ జన్నుదోయికిం
బయ్యెదఁ జేయుఁ బోఁకముడిపట్టునపల్చిన నంతవాసినం
దొ[illegible]లిమేనుగానఁబడఁ దోడన డాయఁగఁ గౌఁగిలించినా

జొయ్యెఁ గామతంత్రకలనోదధిఁ జెప్పఁ దేల్చ నయ్యెడన్. 15

క. మనములు కలయుటఁ గనియును, దనువులు కడకడల నుండఁ దగునే యని య
మ్మనములగతిఁ బెనఁగొనిరో, యన గాఢాలింగనంబు లద్భుతమయ్యెన్. 16

వ. అవ్విధంబున లజ్జాభరంబు వదలి పురాతనోపాయంబులు పొదలిన. 17

సీ. అధరాధరామృతం బాస్వాదనము సేయు మోహమందఁగఁ జేసి ముద్దుఁ బెట్టు
దరహాస మాననాంబురుహసీమ ఘటించు మునిపంట నొయ్యన మోవి నొక్కు
నెడనెడఁ గిల్గింటు సడలిన ముడిగొల్పుఁ జేలాంచలంబునఁ జెమరు దుడుచు
నసదు లేఁబల్కులఁ గొసరి పేరునఁబిల్చుఁ గనుదోయి సౌఖ్యసంక్రమముఁ దేల్చు
గబ్బిగుబ్బల నెదనాటఁ గౌఁగిలించుఁ, బారువములకుఁ గళరవాభ్యాస మొసఁగుఁ
జేరికొనఁగోట మక్కువఁ జెక్కు నొక్కు, యువతిసురతంబుఁ జల్పునయ్యుత్పలాక్షి.

క. ఎదఁ జేర్చినప్రాణేశుఁడు, మదనాయని పేరుకొన్నమార్గ్మగ మిడుచు
న్మదిరాక్షితోన వెఱచం, గదయన నుప్పొంగి మరలఁ గౌఁగిటఁ జేర్చెన్. 19

వ. ఇవ్విధంబున మదనకదనాహూయమానమానసు లగుచుఁ గలావిశేషంబులం బొ
దలుచు. 20

క. మునితయు విభుఁడును నేర్పులు, వదలినఁ గని రపుడు పారవశ్యసుఖంబు
ల్మదినాటి యున్నసుదన, ప్రదరంబును బెఱుక బాళివట్టినభంగిన్. 21

క. ఈవిధమున విహరించుచు, భూవల్లభుఁ డుండెఁ బూవుఁబోఁడియుఁ దానున్
భావభవబ్రహ్మసుఖ, హావిష్కృతహృదయు లగుట యవనీనాథా. 22

శా. ఆయిక్ష్వాకుఁడు నిట్టురంగపతికత్యంతంబు నిత్యోత్సవ
శ్రీయోగంబులు చేయుచుం గుజనుల న్శిక్షించి వర్ణాశ్రమా
పాయంబు ల్దెగఁ గోయుచుం గ్రతుహవిర్భాగంబు లింద్రాదిదై
తేయారాతుల కెత్తిపోయుచు జగద్గీతప్రభావాఢ్యుఁడై. 23

గీ. అవనిరాజ్యసుఖము లనుభవించుచుఁ బెద్ద, కాలమున్నఁ జెంపకడలనుండి
కలయనరపువచ్చి గడ్డంబు మీసలు, గప్పగొరబాగుగానవచ్చె. 24

క. హరిభక్తిఁ బౌరుషంబునఁ, బరమైశ్వర్యమునఁ బెద్దప్రభువతఁడు వయః
పరిపాటిఁ బెద్దయైబం, ధురసూక్తిఁ గుమారవరునితో నిట్లనియెన్. 25

మ. సుకుమారాయిక మారణంబు లుడిగెం జుమ్మీ శరాలోకకం
టకఘోరారులమీఁద నల్గి ముడివెట్టంబోయిన న్నైష్టలాం
తికభూమండలపీఠి ద్రొక్కక యిసీ దృగ్వ్యాప్తి రోధించి మా

టికి వ్రేలంబడు రాఁ బొమలొక్కమరునాఁడే చెల్లె మాపై ఖరుల్. 26

చ. గగనసరస్సరారి యనిఁ గైదువఁబట్టిననాఁడ కంటి నీ
జగడము నేర్పు నీడగు భుజామహిమంబిఁక లోకరక్షకం
బగు నఖిలాంతరీపవలయాంచితమేదిని కెల్ల నీవ రా
జగుమని యక్కుమారుఁ బురియం దభిషిక్తుని జేసి వెండియున్. 27

ఉ. నిశ్చయమొప్పఁ బ్రాంతరమణీమిదండకులున్నవారు
శ్చలితారు లమ్మగురుఁ జాలక నూర్వ్వారు చిన్నవారు ప్రా
క్పశ్చిమదక్షిణోత్తరవిభాగములన్నపుత్రులై వికుక్షికి
న్నిశ్చలభక్తులై మెలఁగ నిల్పి వినిర్మలచిత్తవృత్తియై. 28

గీ. పరమనిష్ఠ రంగపతిఁ గొల్చియుండు నా, రాజు మఱి వికుక్షి రాజ్యభోగ
చతురుఁ డయ్యె నితని సతి యంశుమతి యశో, ధనకుమారి దౌహృదంబుఁ దాల్చె.

సీ. ఎలకుండలకు రెంటికెక్కుడఁ గల్గెనో నీలకిరీటము లీన్నలవేణి
మూసిపెట్టిరదేమేముకురంబు లొకరెండు తెలిజిల్గు పావడఁ గలువకంటి
జిగురులు రెంటికే తగవునఁ బొడమెనో యందంపుఁ దొట్రుబాటిందువదన
నిదురకుఁ బడఁజొచ్చె నెత్తమ్ము లొకరెండు తెఱఁగిది యెట్లొకో మెఱుఁగుబోఁడి
యనుచు వలిచన్నుఁగవ కప్పు మొనలుగంద, పాండిమము పాదముల నడబడలిక యును
నెల్లపుడు శయ్యఁ గనుచోయి నెలయు నేర్చు, నేరుపున నెచ్చరింతు రన్నెలఁతనగఁగ.

గీ. మెఱుఁగుఁబోఁడి కుక్షి మెఱుఁగెక్కు వచ్చుచో, రమణిభోజనాదరము తొఱంగెఁ
గాంచఁగన్న కలిమిఁ గడుపునిండినవారి, కత్తెఱంగు నిక్కమగున కాదె. 31

క. పన్నిదములరసి గెలుతురు, వెన్నెల తమ మెదుటఁ జూప వెలఁదులు తమలో
నన్నెలఁత మేని తెలుపున, నున్నకురుల నలుపుఁ జెలిపి నూత్నప్రౌఢిన్. 32

చ. వృషభకకుత్స్థదేశమున వీరవినోదము సల్పఁగోరు దు
ర్వృషహపలాశగర్వము డిగించి యమర్త్యులఁ బ్రోవఁ జూపు సే
ముషి నిడునీరు గర్భవతి మోవఁగ భావికుమారహృద్య పౌ
రుషమహిమ ప్రవర్తన నిరూపక భూరి మనోరథంబునన్. 33

గీ. ఈవిధంబున సుకుమారు దేవి యతని, జఠరమున నున్న విష్ణుతేజంబు నంశ
మెలయు గర్భంబుఁ దాలిచి నెలలు తొమ్మి, దియును మోచి భానుకులంబు తేజరిల్ల.

మ. కనియెం బ్రస్ఫుటసర్వలక్షణశుభాకారుం గుమారాగ్రణిం
జనిలగ్నగ్రహచారసంపదలు మెచ్చం బంచె దైవజ్ఞులన్

వినవచ్చె న్విసువీథిదిక్కున సుధీవేద్యంబులై యింద్రవా
హనవర్ధిల్లు పురంజయాఖ్య మను కకుత్స్థాఖ్యయు న్వాక్యముల్. 35

ఉ. అట్టియెడన్వసిష్ఠముని యాసుకుమారనృపాలుఁ గాంచి నీ
పుట్టిన బిడ్డకుం జనకుఁ బుట్టిననామము సెల్లవింతె వి
న్నట్టి కొలందులే యివిమహార్థము లింతకుఁ డీకఁ జేయునీ
పట్టి జగజ్జిగీషు నిజపౌరుషభవ్యకథాఫలంబునన్. 36

క. అనినఁ బ్రమదాంబునిధిలో, మునుఁగుం దేలుం దదీయములు తరగలు చే
కొని చల్లునెల్లవారికి, జనపతి వదనముల నెవల జడిగొని నిగుడన్. 37

క. అనిమిషగిరి రోహణ గిరు, లనుఁబగదలఁ జిదియ నడిచి యిచ్చినబాగై
కనకమణు లుప్రోత్సవ, మున విప్రులకొసఁగెఁ జూడ్కి భూపతినగరిన్. 38

గీ. దిక్ప్రసాదంబులే కాదు దివ్యఘుసృణ, చందనజలాదికంబు వసంతములును
నఖిలవర్ణాభిమతమయ్యె నమ్మహంబు, పురముడు వెడలెఁ బుణ్యాహవిభూతులెలసె. 39

వ. సుకుమారుండును సకలజన గురుజనాదృత నామత్రయప్రచారుండును ధాత్రీసముప
లాలనాధీనుండును బ్రతిదినవర్ధమానుండును నగుచుండె. 40

సీ. జరగు బొమ్మన ఫణిస్వామి నేఁడు జయించు గతినెల్లిమఱి గెల్తుగానియనియొ
నిలుచు లేవంకితో నిజసంగరాగామి పరనృపస్థితి తేటపఱతుననియొ
పాంసు రూషణమెప్ప బలధూళి నినుఁగప్పఁగలచేష్టఫల మాదిఁ గాంతుననియొ
యభ్యసించును విద్యలశ్రుతవ్యాఖ్యాత నయిగురూల్లంఘుని నగుదుననియొ
యని యభిజ్ఞులెల్లఁ గొనియాడఁ బెరుఁగుచు, నుచితకాలసంభృతోపనయన
తేజుఁ డక్కుమారదేవుండు మేనికి, సంతరించె నిండుజవ్వనంబు. 41

క. నగనాగకమఠకిటప, న్నగనాథుల కనిభరము నాఁడు న్నేఁడు
న్మగుడఁగ మోవంబడు నను, వగపుడిగె న్వంశకరుఁడు వాఁడీడేఱన్. 42

ఉ. ఆతని యౌవనోదయము నప్పటి చెల్వము రాజకన్యకా
జాతము శీతలక్రియల సంపదఁ దేలిచె శంబరారికిం
జేతులు నొవకుండ జయసిద్ధి తదీయవిలాసకీర్తి చం
ద్రాతపసాధనంబొకఁడ యంతకుఁ దోడ్పడిచేసె వాసిగన్. 43

ఉ. చొచ్చిపెనంగ కడ్డములు చూపుచు సాదన యొజ్జదొమ్మిసా
మిచ్చిపెనంగు మల్లశతమించుక యాడుచు మేవిదిర్చిన
న్వచ్చిన లావటుంజెదరి నల్గడలం బనుసంగడంబులై

వచ్చు విహారశైలములు వానిపరిశ్రమకేళిఁ గేలికిన్. 44

క. ఉఱకసుపీ ఖండా గొని, నఱక నయోమయములగు ఘనస్తంభములం
జిఱుతలు గొట్టఁగనగునని, చిఱునగవునఁ జూచుఁ దెచ్చి చెంగట నిడినన్. 45

ఉ. ఆతనిశబ్దభేదిశరమచ్చటికిం బఱతెంచునంచుఁ గా
గా తమయాండ్రు బిడ్డలును దారునరాతులు మౌనులైనవా
రాతత చక్రవాళగుహలందు వసించియు వానియస్త్రవి
ద్యాతిశయంబు పేర్మిఁ దరమాకొనియాడఁ బినాకపాణికిన్. 46

క. కొలఁకులఁ గొండల కెలఁకులఁ, గలకలములు రేఁచురాచకన్నెలఁజలిమం
దులవారల బలవైరులఁ, బొలుపార్చు నతని చెలువు భుజములబలువున్. 47

క. ఈరీతి జవ్వనపుసిరి, నేరఁ బురంజయుఁడు వీరశృంగారమయా
కారుండై సుకుమారమ, హారాజుం గొల్చియుండ నటవచ్చివెసన్. 48

గీ. త్రెంచిగురువెంద పేరు క్రొమ్మించుపడిన, మేఘమనఁదోఁచు నొకకట్టెమేనియోలుకు
ప్రాఁతనెత్తుట మక్కుఁడు వట్టియున్న, యంపఁగమి ముందఱంబెట్టి యడ్డపడియె.

క. పడియున్నవానిఁబతియే, ర్పడఁ గని యిదియేమిలేవరా రారా యె
క్కుడివాఁడవురా మఱినీ, యడవియునీపేరుఁ జెప్పరా వినవలఁతున్. 50

ఉ. తుప్పలు పట్టె నేర బలుతూపులు నీగురిగింజదండమం
దప్పితివేమి నావుడు నతండును దగ్గనలేచి దేవరా
యిప్పటి కమ్ములింత చెడియెం గడినోరికిఁ బోదు దూపమం
దిప్పలనీరె మాగురుల తీయనిపాలురుచింప వేమియున్. 51

క. మంచి గురిగింజ పేరును, బెంచెపు తలపూవు నింకఁబెట్టఁగడఁగనా
యంచు శిఖాబర్హంబును, ద్రుంచి శరము లెంచి రాజుతో నిట్లనియెన్. 52

సీ. ఇదికొండ కోనదాఁటు నిట్టెఁ జందురునిట్టెఁ దలఁకించితాఁకినములికిసామి
యిది బెబ్బులికినల్కి యెదవడ్డ యొకలేటిబాలెంతఁగాచిన కోలయొడయ
యిది కాఱుపోతుతోఁ గదసినజముపోతు నడకించి గెడపినయమ్మురాజ
యిది సింగము నడంచి యేనుఁగు విడిపించి దొరవాసినిల్పిన తూపుజయ్య
కడమవియు నిట్టివియకాని కడమలేదు, నల్లపెనువాగులోఁ గొన్న తెల్లనీటి
యేటిబడిఁ గానఁగాతు నన్నెలుకు లెల్ల, మీరుఁడని కొల్వవీన గర్వింతునయ్య. 53

క. పులుఁగులలగుడులుగులమగఁ, డెలుఁగుల పిడుగే కలములయెదమడుకు చివం
గులగొంగ బెబ్బులులవిది, బలుమెకముల గండమనఁగఁబడు నీతూపుల్. 54

ఉ. తాఁకిన యమ్ముగాక గుఱిదప్పిన యమ్మొకఁ డెత్తినచ్చినం
గూఁకటు లెత్తి కొట్టుదుము కట్టలనైనను వీళ్లలోనన
ల్వేఁకలవార మేమివియు విల్లునుబట్టి పొలంబు మెట్టియే
పోఁకెటువంటి సంపదలుపోఁ జనుదేరము వీటి కెట్టిచోన్. 56

ఉ. కానకు సంపతప్పెఱుఁగు గబ్బిమెకంబులు సేరఁ గారుపో
తేనుఁగుదాయ యెల్లుపులి యేసినయేటు సివోయెఁ బోయిన
న్మానితి నిస్సిరోయనుచు మాకులకాయికమైన వేఁట య
య్యేనెలనుండి తుప్పు దినకుండునె తూపులువేయి నేటికిన్. 57

క. నిను గడచిన తలిదండ్రులు, విని నాదుందుడుకుఁ దుడిచి విడువంగలరే
యని యేనెరికిఁ జెప్పక, చనుదెంచితి ననఁగ వచ్చె శబరబలంబున్. 58

ఉ. వచ్చి యిదేమి చెప్పకిటు వచ్చితి వప్పుడు కాఱుపోతుతోఁ
బొచ్చెపు బొల్లి వెల్లి మెకము ల్దమ బెబ్బులిఁగూడి గూడెము
ల్సొచ్చి తినంగఁ జెంచు లొకచొప్పున నూర్గురవోయి రన్నవాఁ
డచ్చెరుపాటు సిగ్గు నెలయన్వినుచుం దలవ్రేలవైచినన్. 59

మత్తకోకిల.

అప్పుడాసుకుమార భూవిభుఁ డాతనింగని మాయలం
గప్పిరక్కసు లిట్టుచేసిరి గాక యొండెడ నేటుదాఁ
దప్పునో మెకమూరు సొచ్చునె దండిబంటవుగావె నీ
చొప్పు చెప్పక చెప్పుచున్నది శూరవిద్యల నేరుపున్. 60

ఉ. మాయలు మాపురంజయుఁడు మానుచు మానఁగనేల నీకునీ
బోయలకేమి వేఁట గడివోయెనె యేటికిఁ జిన్నవోయె దం
డేయలుఁగమ్ము చక్కడచు నేపులినీ విలుద్రుంచుఁ బోయిరా
రాయిటువంటివా మతులు రాక్షసమాయల కీవుకర్తవే. 61

క. అని వాని మరలవేఁటకుఁ, గొనకొనఁగా నూఱడించి కులధర్మము త
ప్పనిపౌరుషాభిమానం, బున కెంతే గారవించి భూవిభుఁ డంతన్. 62

చ. అసవుల నీవుదాల్చునడి యాలపు సొమ్ముల కీడుగాని మా
తొడవులు వెట్టుమంచుఁ గృపతో మణిమంజుల భూషలాదిగాఁ
నుడుగర లిచ్చినన్వగచు చొయ్యన నందియతండు సైచుమీ
బడసని తప్పనేఁడు వెతఁ బట్టకమానితి వేఁట కానికల్. 63

గీ. ఏటి వెదురుజాతి యేనుంగుతలజాతి, పందికొమ్ముజాతి పాఁపపడఁగ
జాతిగనిన పూససరకుల కొక్కొక్క, యిల్లు చూపు తెత్తునెల్లిసామి. 64

క. జల్లులు పునుఁగు జవాదుల, పిల్లులు సింగములపులుల పిల్లలు మాకుం
గొల్లలని తెచ్చియిచ్చినఁ, గొల్లలుగాపన్ని చదురు గొడఁగులు వినవే. 65

వ. అని మెచ్చు నచ్చెరువుం దగవు నగవుం దేటపడమాటలాడి మఱునాఁటివేఁట వ
యినంబున కాయితంబు గమ్మని క్రమ్మరరాజుచేఁ గుమారున కనుజ్ఞయిప్పించి యం
పించుకొని తనబలంబుతో వెడలి పురోపకంఠంబున విడిసి రెండవనాఁటి ప్రొద్దుపొ
డుపుఁ గోరుచుండె. జనవిభుండును హజారంబు పేరోలగంబు చాలించి యందఱి
ననిచి యనుసరించి తనయుండురా నంతిపురంబున కరిగి సముచితప్రకారంబునం
బ్రవర్తించె. పురంజయుండును నద్దినశేషంబును నాఁటినిశావిశేషంబును గడ
పి కడపటఁ గాల్యకరణీయంబులు నడపి మృగయావిహిత వేషభూషితుండై
దండితనంబున. 66

గీ. కడలియాల్లునికుడికన్నుపాడుపుఁగొండ, యెక్కు నెడనుత్తమాశ్వంబునెక్కి పౌర
మృగయులేతేఱవెడలు నమ్మేటి మగని, సంభ్రమంబునఁ గని నిశాచరవిభుండు. 67

గీ. నిన్నమీయయ్యవలె నుంటి నెఱతనమున, నేఁడుమాయయ్యవలె నున్నవాఁడ వెలమి
నన్నిబాగులు నమరుగాయయ్యనీకు, నని కొలిచిపోయె నవ్వించు చడవితలను. 68

మ. గహనంబుం గనుపట్టె మమ్మునఖిలాకారోపకారప్రథా
మహనీయంబులఁ జేసి యిట్లు చరతామాంద్యంబు నన్మంతెనా
నహహా యమ్మిగు లింతయుంబెరిఁగి సత్యంబంటి నన్నల్పక
స్పృహసేవం దలసూపునోయనఁగ నల్లేయున్న భూజంబులన్. 69

క. ఆవనము చూచి యుత్సా, హావిష్కృత మృగయు సాధనావళుల కథ
నీమవారును మావారును, గోవిదశబరయని రాచకొడు కటఁజొరఁగన్. 70

వ. భిల్లవల్లభుం డెల్లరం జూచి సాధనధనులకా విచారించి. 71

క. ఇందుండి పోగువారుం, డం దందు న్వాలల నట్టుఁడ న్వాలియోదా
లందుండి కావు గప్పుడు, ముందటఁ గాలకులను నిలిచి మున్నఱక మెయిన్. 72

క. పొంకించుఁడు మీయిఱ్ఱులఁ, గొంకుల సీసంపుగుండ్లఁ గొమ్ముల నుకలం
బొంకించి దిగుచగాలి వ, లంకుల బండంగి బండ్లు పఱపుండనుచున్. 73

క. తనవారు రాజువారును, బనిహరువును దెలుపుకొనుచుఁ బసరక యెన్నం
డొనరించిరో యన నన్నియు, ననువుపఱని కడలవెనుకయయి యతఁడరిగెన్. 74

క. తెర దీము బోసు వేఁటల, వరుసలెత్తిఁగి పెద్దలాగు వరుసగనడుపం
జొరఁబఱపఁ బొడువనడువం, దరుణవయశ్శబరులరరె తగుననిపించెన్. 75

ఉ. రాజకుమారుఁడు స్నయనరంజకముల్ప్రగయావినోదము
ల్రాజిలఁ దేజిఁ దోలుచుఁ గోలంకులఁ దేలుచు వేష్కనేలుచుం
భూజపరంపరాపరిధి భూషితమై బయలున్నచోటరాఁ
గా జగడంబు చేసె సొకకందువఁ బందులు జాగిలంబులున్. 76

సీ. కఱచినచెవిసూబ గరుసూడిగండెండి బెళకపైఁబడిత్రిప్పుకొలిపెసున్న
బిరుపందువీఁ పెక్కిపెడతల నమలంగ సుడిసి కంపలఁ బెట్టెఁ జాల్లరంబు
కుక్కకూఁతలు వెట్టికొనఁ బీఁటవదలక గడకంటఁ గాఁ జూచె బడియపంది
లాఁచితప్పిన జాగిలము గొట్టుకొట్టునఁ గూడినపిడిఁ గూల్చెఁ గొమ్ముకాఁడు
వీరచేష్టితసూకరసారమేయ, కఠినసంకులకలహంబు కన్నదనియఁ
జేసెనౌరౌరయని సంతసించెఁ గెలన, మనుజనాథకుమారుండు మఱియుఁ జూడ 77

ఉ. బయ్యనబాళి తేజులొక పట్టునఁ బట్టిన వారుపట్టెడల్
డుయ్యఁగఁ దూలి బిట్టొఱలి డొల్లఁగఁ గొన్నిటిఁ బట్టెఁ బందులం
దయ్యములం దయాంతకుని దంష్ట్రలు వేర్పడి పట్టినట్టుల
క్కయ్యము...త్తు...విన్న విహంగంబులు డేగలబారిఁ బాఱఁగన్ 78

ఉ. మాకుఁ బతంగభావ మజుమన్నన మున్న లభించె నింకమా
యీకలబల్మి లోకమున కెక్క శశిత్వముఁ దాల్తుమంచు నే
మో కిటి కుర్కురధ్వనులు ముట్టినఁ బాఱు శరంబులన్నగు
ల్లోకడఁ బట్టియాడె నటులార్పఁగ నేర్పఱు లోర్పు తేర్పడన్. 79

వ. వెండియు. 80

ఉ. గండొకపందితోఁక తొడుకం గడకం బెఱపంది గొట్టిన
న్మొండియమూడి కుక్కతల...బడ నవ్వ రాహమా
యండలఁ జెట్టు గుట్టయన కన్నిటిరాచిన నూడదయ్యెనే
తెండటు గొన్నదాని కొల దీనికి టంటెననంగ నెల్లరున్. 81

ఉ. బండెనస నొంటికా డొకమహోద్ధుర ఘుర్కురమస్తకంబు దాఁ
జెండుచు...గయ జెండిన చెంగట జింక దాఁటుకా
బొండుగు బొమ్కసం గఱచి బోరగిలంబడ వ్రేలెఁ జూడఁగా
రెండిది రొమ్ముగాఁ దెగినయు రాఁబెనఁగెం బనపీఁట వంతెనన్. 82

వ. అంత. 83

ఉ. చీఁకటి ముద్దలన్ ...జీవములుంగనినట్టు లున్నయా
స్రేఁకనిపందులన్ శబరవీరుఁడు బల్లెములంది క్రుమ్మిచే
బాతుల గ్రుద్ది...పయిపాటుల నొచ్చియు మెచ్చు రేఁచఁగా
నేకటదీఱఁజూచి మనుజేంద్రకుమారుని గోడ చేడుకన్. 84

గీ. వీరనామశబరుఁ డోరాచవేలుప, యొగువ జొంపమెకము దిగువ నలుఁగు
నాల్గు దెసలమూఁగె నను జూచు మొకకోల, నొకటిదాఁకి రెంటి నూఁగ్వవలయు 85

చ. అని విలువంచి యొక్కొకమహాకిటిఁదూఱఁగ నేయఁ దూపుదాఁ
కినపడిఁ జెంతనున్న యొలుఁగే పులియే యన కోరకోరలం
దునియలుగాఁగ నొక్కొకటి ద్రుంచి శరవ్యవహారముల్వడిం
గనికని యింద్రవాహనుఁడు గన్నులమెచ్చెఁ బుళింద వల్లభున్. 86

గీ. ఇట్టిఁగూడెఁ దటిమి యొగసినఁ దోడన, నెగసిపట్టి వ్రాలె నిలువ నొకఁడు
చినిఁగి గొంతువగుల జేకత్తి జళిపించి, కెడపెఁ జేఁగిటారిఁ బొడువ నొకఁడు. 87

క. కే...వు...న కొకొఁడేలిక, పాదముపై నానవెట్టి పైఁబడుపోతుం
జేదోయిఁ గొమ్ము మోరయు, వేదోరకంబట్టి యొక్కవితిచెం బెలుచన్. 88

ఉ. పంగిడిఁ జిక్కి కోదములపజ్జలఁ ద్రొక్కక మూకఁ దోలుమా
తంగము నొక్కఁ డొంటిమెపఁదట్టి పయింబడి సిల్పియల్గుచే
నంగమెటింగి లేఁదొరిజ యాసయుగా దొడబడ్డ యెక్కుఁడే
నంగుల వేఁట కింతనిపుణుం డిఁక లేఁడని మెచ్చ నెల్లరున్. 89

గీ. ఇవ్విధమున నెవ్వఁ డేవేఁట మెప్పించె, వానివానిఁ బిలిచి మేనకాని
వేడ్క పెచ్చుపెరుఁగ వేఁటాడ నెడలేక, యుండు నప్పురంజయుండునంత 90

క. మేలురయని వివిధాయుధ, జాలురఁ జూడక భుజైకసాధనమృగయా
శీలుర సాహసపథజం, ఘాలురఁ జూచుటయు సన్నగైకొని వారున్. 91

వ. విక్రమించు సమయంబున. 92

సీ. ఒకచేత నెలుఁగొంట నొకకొండగాటియఁ గా నొకఁడు ద్రిప్పెడు ద్రిప్పుడొఱపు గాలిపె
నొకచేతఁ బులి నొంటు నొకచేఁతలేడిగా నొకఁడెత్తు నెత్తికో లాఱపునిలిపె
నొకచేత నలుఁ గొంట నొకదుప్పికోదమగా నొక్కఁడూఁచిన యూఁపులుప్పతిల్లె
నొకచేతఁ బోతొంటి నొకమన్నుఁబెంటిగా నొక్కఁడార్చినయాట లొప్పిచెల్లె
నొకఁడు నొకటఁ దగక యొకటికిఁదగకొక్కఁ, డోపి రిట్లు రెఁటి కొకఁడె చాలి

పలుఁగల మెకాల వలకేలు డాకేలు, బిరుదు గిరుదుఁ బంచిపెట్టుకొనఁగ. 93

గీ. వీరు లిట్లు మెఱయ వేటలోఁ దనయుక్తి, కొంకి గుండువీడి గుంపుఁగూడ
గుండునడ్డ దీము కోలములోఁ గూడెనం, చొక్క బక్కయెలుగు చక్కనగిరె. 94

గీ. వారికిచ్చె నల్లవాని? విభుఁడీగు, లిచ్చె జూదు పుణ్యమెట్టులుండె
నడిచియుడిచి దంచినవ్వాప నూరక, యున్న యప్పుకోదవె నొక్కఫలము. 95

వ. ఇదియు నొక్కొక్క దిక్కునం జక్కటి యనిపించు నదియట్లుండె. 96

క. చూచియు నిచ్చియుఁ దనియని, రాచూలికి వేఁటలాడరాఁ బ్రోద్దిది
యీచక్కటి నననత్తతి, వాచాగోచరము గాని వగ సంధిల్లెన్. 97

సీ. చోరబడ్డ ముంగిస యురినడ్డగరిమిడి మునుపుగా గొల్లున ముగిసిపోవ
జోడించిన సివంగి కేడించుకొను నిట్టి వెనుకగాఁ గుట్టూర్పు విడిచి త్రెళ్లఁ
జూపివేసిన డేగ చోపి లేపినపుల్గు మీఁదుగా మీఁదనే మిడిసి పడఁగఁ
గఱనఁద్రొక్కిన కుక్క వెఱవ కెక్కిన పంది క్రిందుగా బాణము ల్చిందికూల
మృగగళగ్రాహికరముల బిగువు వదల, గలవలలు మీటువారు మూర్ఛిలము మంగ
మిట్టి వినువీథిఁ దిరుపులు గట్టికట్టి, రణహరులు రాఁగనౌకమహానినద మెగసె. 98

క. ఏమనఁగవచ్చుఁ దధ్వని, చేమిగిలిన వేఁట ముగిసెఁ జేడ్పడిరితరుల్
దీమసము వీరశబర, గ్రామణి యొకఁ డొంది యప్పురంజయుతోడన్. 99

క. గబ్బి మెకములని మున్నె, నబ్బురపడి చెప్పినట్టి యానాల్గిటిలో
బొబ్బమెకము రొద సుమ్మది, జబ్బా వినుమనఁగ నాకసము దెస నంతన్ 100

క. తిర్యగ్ఘ్న మృగఘ్న నద, ఘ్నార్యఘ్ను లనంగ నలువు రసురలు వీరో
హర్యంశజనిత వింటే, హార్యతు వ్యాఘ్రు ఋక్షు హరిరిపు రూపుల్. 101

గీ. అనియు వీరసాధ్యలబ్ధభూవరశక్తి, ననియు సింహరూపు నట్టహాస
మతఁడు వలసినప్పుడందుఁ దిర్యగ్ఘ్నాఖ్య, ననియు వేగవారిఁ దునుము మనియు. 102

క. వినఁబడిన మేలు కాకని, ధనువుం దూణీరయుగము దాల్చి కటుజ్యా
నినదమున దెసలు వసమరఁ, గనుగవ లెల్లెడలఁ ద్రొక్కఁగా నునుఁగెంపుల్. 103

క. ఘోరాజికౌతుకంబున, ధారాకౌశలము మెఱయఁ దనతేజీనా
శేరాచరౌతు వీరర, సారాధ్వనచతురుఁ డచట నాడింపంగన్. 104

సీ. సింగంబు పఱతెంచి ముంగాలఁ దమల్చి నమలి కారొప్పెతుల నుమిసికొనుచుఁ
గాసరం బరుదెంచెఁ గేసరిపరికరంబు శృంగకోటులఁ జెలఁగికొనుచుఁ
బులితాఁకుదెంచె నెగ్గులపొక్కలవియఁగాఁ దిగిచి మార్కొని పోరది ద్రిప్పికొనుచు

బుభుక్షమే తెంచెఁ దరక్షువ్రజకళేబరములు రూపఱఁ ద్రొక్కి చమరికొనుచుఁ
బతితమృగసంఘ సంకీర్ణపథము వట్టి, విక్రమోన్మత్త చేష్టితోపక్రమంబు
దప్పితమలోనఁ దమకుఁ దత్తరపుటలుక, తోనపుట్టినఁబుట్టుఁబో వీనికనఁగ. 105

చ. అంతట మూర్ఛదేఱి పులియా యెలుఁగా యెనుపోత సింగమా
కాంతుమ వీనిగర్వ మని గ్రక్కునఁ బైఁబడఁ బోఱు వేఁటకా
అంతకుపోరిలికిం బఱచు నంతకుఁ జూడక దివ్యబాణవి
స్రాంతి నడంచెఁ దన్మృగవిహార ధరత్వము రాకుమారుఁడున్. 106

ఉ. రక్కసులుం భయంపడక రాసుతుపై నొకఁడింద్రదంతియై
యొక్కఁడు మేఘమై యొకఁ డయోమయపర్వతమై యొకండుదాఁ
డెక్కలి మిత్త్రయై యరుగుదేఱఁగఁ జూచి యతండు వీరియా
చిక్కులు సాగనీగి బలుసేగి బలంబున కంచుఁగ్రక్కన్. 107

పంచచామరము. సమంత్రకంబుగాఁగ నైంద్రసాయకప్రయోగము
కుమార శౌర్యశాలి సేయఁ గోటి కోటి బాణము
లక్రమక్రమోదితంబులై వికారి దైత్యమాయలన్
గమర్చి తచ్ఛిరంబు లూడ్చెఁ గండశైల భాగముల్. 108

క. కొండలు వోలె సురారుల, మొండియములు గూలె రాలె ముమ్మరముగ నా
ఖండలతరుప్రసూనము, లొండొండ విరించినందనోక్తులు సెలఁగన్. 109

వ. అంత. 110

శా. వీరుం డవ్విలుకానిఁ గాంచి యొడయా వేఱొక్కఁ డున్నాఁడె ని
న్నేరూపంబుననైనఁ బోలు దొర నీవే రాజవు త్రాతవు
స్వీరింగాచితి విమ్ములన్నసుచురా విన్నంది పోరాడఁగా
వారింబాచితి వింక నొక్కవర మే వాసిత్తు మాకిత్తువా. 111

క. ఈకానవచ్చు గీములు, నాకూరిమిగూడె మచట నాలుగుగడియల్
నీకోడండ్రను మనుమల, నీకన్నులఁ జక్కఁ జూడ నిలుచుట తగదే. 112

క. ఇదివరమని పావలతోఁ, బదమూఁదలఁ బెట్టికొనిన వానికభీష్ట
ప్రదుఁడుగఁ గదలి కకుత్స్థుఁడు, తదుపాంతవనాంతరమునఁ దగు మైనిలిచెన్. 113

క. పతితోడఁ బలికినంతను, నతఁడును నధికముగఁ బట్టె నటవీనస్త్ర
ప్రతతులు లుపలుగ సుతుల, స్సతుల న్మ్రొక్కించె నతని చరణంబులకున్. 114

ఉ. రాకొమరుండు నందజకు రత్నమయాభరణాదు లిచ్చి యా

యాకొలఁదిం బ్రియోచితములాడి తదీయసపుత్రమానినీ
లోకమునంచి యన్యులఁజెలో యని వీళ్లకుఁ బంపి సూపకా
రాకలనోపపన్న మృగయాపల భోజ్యరసైక తృప్తుఁడై. 115

వ. గంధోదకంబులఁ గరప్రక్షాళనాదులనివర్తించి శతపద గమనంబునకై నడగూడునప్పుడు. 116

ఉ. క్రేవల వేఁటకాండ్రు దమకింపక డింపక వెక్కుబాకులం
బోవుచు మాంసభేదముల బోనము లాయితమైన దాఁక నా
యావిధు లాచరించి యవియన్నియు దేవరకెక్కనట్టి సం
భావనసేసి తారు మఱి బంతులుసాగి భుజించుచుండఁగన్. 117

గీ. చూచి చూచి నగుచు లేచినవారిఁగూ, ర్చుండ నానతిచ్చు చొయ్యనొయ్య
వెసలె బంతిబంతి వెంటఁ దాంబూలగం, ధములు విపిన సౌరభములగదుమ. 118

ఉ. ఎల్లరుఁ దృప్తులైన వెను కించుక సేపట విశ్రమించి రా
గిల్లినమూకతోడఁ దమకింపని యానముతోడఁ భిల్లరా
డ్వల్లభలక్ష్మితోడ వనవల్లభుతోడ జయంబుతోడ భూ
వల్లభనందనుండు హయవల్గనమొప్పఁగ వచ్చె వీటికిన్ 119

క. వచ్చిహజారంబునకు, న్వచ్చిహరులఁజూచురాజు నకునానతుఁడై
తెచ్చినవివిధసువస్తువు, లిచ్చిన యెఱుకు దొరతోడ నిడియెన్మ్రోలన్. 120

మ. సుకుమారుండును గన్నులం దనుపరాసుల్వంశజాతాది మా
క్తికముల్ గాంచెఁ గటాక్షముల్మృగమదాద్రిద్రవ్యసంపత్తిచా
యకురానిచ్చె వినీతుఁడైతనకు సాష్టాంగప్రణామంబు చే
సికరంబుల్మొగిడించునయ్యెఱుకుఁజూచెం జూపులాపోవఁగన్. 121

క. సకలవిపినాధిపత్యము, నకుఁ బట్టముఁ గట్టికొమ్మనాసభ నని వా
నికిఁ దనగారుత్మతనా, యకమణిహారంబ యిచ్చియంపెఁ బొసంగన్. 122

ఉ. ఆతరువాతఁజూడఁ బరియత్తెపుఁ జేతులు రిత్తిబండ్లు ద
ట్టీతలచుట్లుగాఁగ మగిడించిన పట్టెడపైఁడిత్రాళ్ళనై
యాతల వేఁటకాఁడునికి యారసి రెండిది యేమియన్న న
య్యాతలఁచంగనాకువెఱపై గరుపాటెడుమేనువింటివే. 123

గీ. కానుకకుఁ దేఱఁ జనిచూడఁగాజవాది, పిల్లిలోన్నగ మాపిటఁబెంచినవియుఁ
బెద్దనిద్దురఁ గనుమూసిపెట్టియుండె, వీరిజంతువు లీల్గుట వింతగాదు. 124

క. ఆకూమెకయులసంతతిక, మాయపేవుల మొలుచఁబెట్ట మాకుఁ బ్రాపెం
బోయె నొకకూఁతనన్నియు, నాయాలము వేయుఁగన్నులతఁడగుఁ జూడన్. 125

గీ. అనిపులిందరాజనమ్మహారాజుతోఁ, బలుకుచున్నయపుడ కలదుకలదు
కంటి కంటి నదియుఁ గన్నులుచల్లఁగా, ననుచు వచ్చె నిర్జరాధివరుఁడు. 126

సీ. వచ్చినమానవేశ్వరుఁడుఁ గుమారుండు దానసంభ్రమసముద్యానవినతు
లాచరించియు విమానావతీర్ణుండైన యాత్రిలోకీనాథుఁ డాదరంపుఁ
బరిరంభణంబులు వడిసీయ నతనికి నర్ఘ్యాసనంబిడి యర్ఘ్యపాద్య
ముఖ్యపూజలు తుదముట్టఁ జేసియు బృహస్పతిసర్వదిక్పతిప్రభృతులకును
దగినసత్కృతులు సలిపి తదనుమతుల, సముచితాసనములనుండ యమరరాజ
సేమమా మీకు మీరువేంచేయుటెల్ల, మాతపంబులపంటయై మనుపఁగాదె. 127

వ. అనికుమారుండు పలికెఁ బలికిన సునాసీరుండు. 128

గీ. మీతపంబులయును మాతపంబులయును, మేనిపంటలెల్ల మేనుదాల్చి
మనుజనాథ మిమ్ము మమ్ముఁ గృతార్థులఁ, జేయనీకకుత్స్థుఁ డాయెఁ గాదె. 129

శా. ఏ తేజం బితఁ డయ్యెనీ వెఱుఁగవా యీమాట యిట్లుండె ర
మ్మాతాత్పర్యముతోడ నీ వడిగెదమ్మా మాకు మా సేమమే
నీతో నీయెఱుకప్డు చెప్పెదది దానిం దేట గావింతు వి
న్మాతిర్యఘ్నమృగఘ్ను లిద్దఱు నరఘ్నార్యఘ్ను లన్నిద్దఱున్. 130

సీ. ఉగ్రుఁడన్నసురమణిగ్రీవయు మదారతయును గంధర్వతనయలందుఁ
గవలుగనల్గురఁ గాంచిన కొడుకులు వారునల్వురు బ్రహ్మవరమహాను
భావగర్వితులు దీపధ్వజా నెచ్చెలు లుమ్మపంద్రలోపల మొదలివారు
దేవాసురావధ్యులే వేళకేరూపు వలసినఁ దాల్తురు వారిలోనఁ
బెద్ద తిర్యఘ్నుఁడే బొబ్బవెట్టవినిన, దేవతిర్యఙ్మనుష్యులు తీఱవలయు
ననఁగఁ బోయి తిర్యగ్జాతి యడఁగవలయుఁ, గోరినపుడనియజా వేఁడికొంతమనిచె.

క. వాకటు దిరుగుట విధిమా, యాకృత మపుడతఁడు తిర్యగాకారధరు
ల్రాకాసులు వాహనములు, నాకూఁతక్షుఁ జెడమి వేఁడినది పదిలముగన్. 132

గీ. వరుసఁ బెఱమువ్వురజతరవహ్నిశిఖలు, మృగమనుజమానిసంఘము ద్రెగియెఁ బెక్కు
వీరికిని నామములు రక్తవృష్టితోడఁ, బుట్టునెడ భూతముఖములఁ బుట్టినవియు.

మహాస్రగ్ధర — హాహాగోల్వాంబోయి యే మాయనఁ గనియతఁ డొండానతిఁగాఁ దదాజ్ఞా
పరతన్త్రాంగా వృష్టైకప్రభువయి పులియై భల్లుకంబై మహాకా

సరసమై భాగీరథీపార్శ్వమున నడవి నచ్చండరాకాసు లున్నా
రిరసై సింగంబు దా బొబ్బిడిన గడసె నందెల్ల తిర్యక్కులంబున్. 134

క. అచ్చటికి మనపురంజయుఁ, వచ్చుటయుం గంటి మావరంబు వినియు నీ
నిచ్చలపు రాతు తేజీ, నొచ్చుటలే దధికదావినోదపుఁ గతియున్. 135

గీ. వాహనంబునారోదఁ జెడనలవననుము, నాఁడునిజబలరతుకై వాఁడు వేఁడెఁ
దమవి యని పేరుగుచ్చనిదాన సకల, వాహనములకు సైనమా వరమునిలిపె. 136

క. ఆవనుజనధము సేమము, గాదే మిన్నంది చూడఁ గంటిమి తేజః
ప్రాదుర్భావము గలిగిన, యీదొరనాతూపు దొడిగి యేసిగెలుచుటన్. 137

మ. అని జంభారి కకుత్స్థుఁ జూచి నుతిసేయంగా వినీతుండవై
జననాథాగ్రణి మీకు సేమమునఁ గర్జం బానెమేమేల య
ప్పని ద్వీపధ్వజుఁ డెవ్వఁ డాప్తులుగ ముప్పఁద్రెవ్వరిచ్చోఁ గనుం
గొనఁగన్గై స్వారినీశుఁ డేమనియు నాకుం బోలినం జెప్పవే. 138

తరల—అనిన వ్రజి న్నృపాలకా వినవయ్య దీపపతాకుని
న్వనిచెదం గలనామరాక్షస వీరమాళికి నగ్నిజి
త్తనయకుం దరశాభిధానకుఁ డాఁగుమారుఁడువాఁడు త
జ్జననితజ్జనసంబు నప్పున చక్కనెక్కవిమానమున్ 139

క. అనవుడు రాజాను దేవా, తనకదియొక్రతము వంశధర్మము రొక్కం
బనియేమి విమానంబది, తనయునిఁ గని యనిన దేవతాపతి వరుసన్ 140

చ. వినుమది నాకలోకమున వేఁడుకకత్తియ దానిదానవి
జననిదానమొక్కముని శాపముఁజెంది సుతోదయంబునం
జనునది యయ్యపుట్టిన దెసంబొసఁగెందరశాఖ్యదానికి
న్మనమిన మంచుతోఁ దొలఁకు మించునఁ చంచలయట్ల తోఁచుటన్. 141

గీ. దానివనుపుకాఁడొక్కగంధర్వుఁ డెల్లఁ, జెలిసి సుతుఁగాంచుతతివేచి తేఁటఁజావ్వ
వెసవిమానంబునెక్కరక్కసులతోడి, తొడుసుడిగనంచునదితొంటియొసలితోడ.

ఉ. అపగిది న్విమానవతియై యదివేడుకగానిలోఁ జనం
దాపముఁగోపముం గదుర దాని నభోగమనానుధావియై
గూఁపొలమెల్లఁ ద్రిప్పి ఘనుఁడై యమరావతి కంటెవచ్చితా
నె పవిధారి బాకిఁబడియెం బగవట్టెను దత్తనూజుఁ డున్. 143

ఉ. ప్రేముడిఁ దారసీమఁ గని పేరిడియగ్నిజితాహ్వయుండనా

తానుహుఁ డెత్తి పెంచి కలదానవుపాటఁ జేఁగింపఁ జూచ్చె వాఁ
డేమొనరించు విఘ్నవిధు లెక్కడఁ ద్రొక్కెనొ యద్రికన్యకా
కాముకుఁ గొల్చినాఁడు చిరకాలతపంబున నాజపంబునన్ 144

గీ. వజ్ర మెదు రెక్కకుండంగ వరము వడసె, వచ్చుయమదండమనకుండ వరము వడసె
వరుణపాశాదు లుడివోన వరము వడసె..... 145

క. ఈవిధమునఁ దన కెమరన్, దేవాసురవరులు వివశనిజసాధనులై
పోవం దీపధ్వజుఁడై, దా వెలుఁగం భర్గనరకదంబము నడసెన్ 146

సీ. అగ్నిజి త్తమరింప యమజిత్కుబేరజి ద్వరుణజిద్వాయుజి ద్వసుజితాత్మ
లనుతిశిర త్రిశూల త్రిజిహ్వ త్రిబాహ త్రికంఠ త్రికర్ణాహ్వయులును
గిరిరథో త్కరథ మేఘరథ సింహరథ మహారథ విరథ రథాభిధాను
లనుగల్య కఠినవాలకరాల కర్కశ కామాంధ కలి కాకనామధరుల
నతఁడు సఖులఁ జేసె హాతచతుష్టయముతోఁ, ద్రింశదాప్తసంఖ్య దేలెవినుము
వారి మహిమ లెల్ల ఘోరాహవంబున, గురుఁడు నీకుమారకునకుఁ దెలియు. 147

క. కలరయ్య ఘూసరోమా, దులునల్వురు జోదులఖిల దూష్యవ్యాపా
రులు వారిచతుర్విధబల, ములు ప్రబలము లతఁడు బన్నములు సలుపంగన్. 148

ఉ. పోయి పయోధిశాయి పరిపూర్ణతరంగభవానిలానుసం
ధాయి నపూర్వచేష్టితవిధాయి సమస్త తపస్విమానస
స్థాయి రమానపాయినకదా కని యక్కడ చెప్పినార మ
మ్మాయి ననుంగకుత్స్థుఁడనుమా మఖవాయనియెన్నృపాలకా. 149

క. అనుటయు నిట్లను దేమను, టని యే నడుగంగ దేవుఁడస్మత్తేజం
బునిచితి వికుక్షిగర్భం, బున నది యతఁడయ్యె నతఁడపోయెననియెన్. 150

వ. అని యింద్రుండు పలికిన నమ్మహీవిభుండు. 151

క. తనతనయుఁ బిలుచువాఁడ, య్యనజని మోహమున సాంతడీశ్వర తేజో
జనితుఁడని మఱచి యాపా, పని నేనెట్టనుతు నసుర పైఁ బడహరితోఁ. 152

ఉ. ముంపఱ వేఁట కంపి కడు మోసము చేసితి నిప్పుడేనుజూ
తుం దనుజాతుఁ డంచు మది దుంపుడు కొందఁగ నాకసంబునం
బందిరి వెట్టినట్లు లెలపాయమునం బలవజ్జయంబు సూ
పం దెగి నేర్చి పుణ్యపరిపాకమున న్నను జేరియుంపఁగన్. 153

క. మగుడంగ నిందుఁబొమ్మనఁ, దగునే యీయసుర యేకతముఁడే జహుదై
త్యగణావృతుఁడఁటె యందో, డగుటకు నెవ్వఁడొకొ యింద్రుఁడని దిగులొందన్.

ఉ. ఆయన యీయసాలపను నాననదీనత గాంచి యయ్యభి
ప్రాయమెఱింగి లెస్స చెవిఁబెట్టెఁగదా కత దానికేమి ము
న్నే యది యేయెడం గలిగెనే నను బొజ్జకు నీవెఱుంగ వే
యీయనవద్యతేజ మితఁడౌటకు సందియమంది యోడెదే. 155

ఉ. ఒండొకఁడైనఁ బ్రాక్పరిచితోగ్రబలాభ్రసరస్సురద్విప
ద్భంజన పండితు న్నినుఁ గదల్పక వీఁడిఁగాఁ జుమయ్య యి
క్కొండికఁ బిల్వ నప్పగిఁ గూల్పఁగ నీతఁడు కాని చాలఁడ
న్యుండని యొప్పఁ జెప్పి తదనుజ్ఞను దెచ్చి కకుత్స్థుఁ జూపినన్. 156

క. అతఁ డితఁడు వృషభమగునే, ధృతికని శిఖిముఖులఁ జూచె దిక్పతులు బృహ
స్పతిఁ జూచిరి సురుఁడు శత, క్రతుఁ జూచె బలారితత్పరత్వము చూచెన్. 157

వ. చూచుంగాకేమి. 158

సీ. మకుటంబు మాయమై చికిలికొమ్ములు వుట్టెఁ బెనుదోరమై పెద్దపెరిఁగె మొగము
రెండుండి పెఱకన్నులుండక పొడలుబ్బె సోఁగలై యడ్డంబుసాగె చెవులు
కంఠహారము డాఁగి గంగడోలుదయించె వెడలు పునిదుపునై మెడపొసంగె
మును పున్న పదిలేక వెనుక వాలము దోఁచెఁ గేలు గాలును నలుగాలు నిలిచెఁ
గరపదాబ్జంబు లిరువాయిగొరిజలయ్యె, నంసశిఖరములొమ్మఁపురం బైతనర్చె
నడువఁ దడవని కానికొల్వోడుగ నుటికి, వెస బసవరాయఁడై అంకె వేసె వజ్రి.

ఉ. గ్రక్కున లేచి యమ్మహిమఁ గన్గొను రాజునకు న్నిజాంఘ్రికి
న్మ్రొక్కి పురంజయుండు తనమూఁపుర మెక్కిన దివ్యదీధితుల్
గ్రక్కునఁ దోఁచి యందియలు గంటయు మువ్వల పేరు మ్రోయనా
వెక్కసి గిబ్బయభ్రగతి వేల్పులతోఁ జనియెం బ్రతీచికిన్. 160

చ. వెలలిహజారమా నృపతి వేల్పులు దవ్వగు దాఁకఁ జూచి మూ
ర్ఛిలి సచివోపచారములఁ జేసి కుదుర్పడి నా ప్రభుత్వపుం
బలుకుల బిడ్డ నెక్కడని పంచితి వాసవుఁడేమి పన్నె నం
కిలి పడకున్నె యంశుమతికిం దను వేగతిఁ జక్కఁ జెప్పినన్. 161

సీ. అని యలందరుచున్నఁ గని వీరళబరుఁడో యయ్య నీకొడుకెంతకైనఁ జాలు
నగవనమా కానఁ దెగినరాకాసుల కంటె గొప్పలె వారుకలని కితఁడు

వాసిమానిసి గెల్చివచ్చు మీకతమున మింటిరాజులఁ జూడఁ గంటి ననిన
నగి పోయెదే యన్న నాసామి యేనిఁకఁ బోయెద ననిపోయె బోయ రేఁడు
దేవి కెలఁగింప బిడ్డఁడా కావరంపు, రొదలయాఁబోతు పైమింటఁ గదలువాఁడు
వచ్చునా యని యిలవ్రాలఁగ్రుచ్చియెత్తి, తేర్చసతిఁ బతిదైవంబు దెల్పుచుండ. 162

—*లయగ్రాహి.*—

ఆయెడ వసిష్ఠముని నాయకుఁడు వచ్చి జననాయకుఁడు దేవియువిధేయములు పెక్కు-
ల్సేయ వినయాదికములాయిరువురం బిలిచి మీయునికి చింతకొడలై యునికిదోఁచెన్
బోయనికి జాఖ్యలకునీయనుఁగుఁబట్టినృపుఁడాయపుడటీకయిడుఁజూయననెయింద్రుం
డాయెగదవాహనమయాయనఁగకుత్స్థుఁడును నాయనపురంజయుఁడునైయిపుడువచ్చెన్.

గీ. పురము లాసురంబు లెరియించును జయించు, నింతకేల మనసుచింత గొనఁగ
ననియతండు సనియె నయ్యింద్రవాహనుం, డభ్రగతిన పశ్చిమాబ్ధిఁ గదిసె. 164

వ. అప్పుడయ్యిందిరాగురు నింద్రగురుండు పురంజయునకుం జూపి. 165

సీ. దీపించుచున్నాఁడు భావానుమోదజప్రాబల్యశబ్దప్రపంచమునన
చల్లించుచున్నాఁడు సకలవీచికల నీయుదధి సీకరలాజలెదుటి కెగయఁ
జళిపించుచున్నాఁడు ధళధళన్మీనాసు లేర్పఱపంగఁ దోడేయుటకును
బన్నించుచున్నాఁడు బలిమిబారులు గాగ జలమానుషక రేణు సంఘములను
జయము నీకెల్లభంగుల సంఘటింప, మొదలి నెయ్యంబు దలఁచి సముద్రరాజు
చూడు మనవుడు తనతాల్చు నూడిగంబు, కానుకఁగ వైచి తాచూలికరము మొగిచె.

ఉ. వైచిననూడిగంబు మురిపంబునఁ దాలిచి దివ్యమూర్తియై
లేచి పయోధిపై కొకఁడు లేమలతోఁ జనుదెంచి వేళయు
న్వేచి సబాణతూణములు విల్లులు జోడు నొసంగి పోయినం
జూచి కకుత్స్థుఁడేమియిది చోద్యమన న్విని దేవమంత్రియుఁన్. 167

చ. అతఁడు సముద్రుఁ డీవిడిన యాభరణంబె ధరించి వచ్చినాఁ
డతివ లగణ్యపుణ్య నదు లమ్మెయిరాక త్రిలోకబాధక
ప్రతతివధించి యిండ్లు నిలుపంపగు నెల్లరకంచుఁ దెల్పఁ జో
డితరదురాపమీవిలులు నేయఁగనిండియయుండుఁ దూణమున్. 168

క. ఇవరుణుఁ డౌర వరంబులు, సవరణయిదివలఁచి యొక్కొ-చనుదెంచితివీ
వవులం దేకని బలనిధి, యవునిచ్చె న్మెచ్చె వరుణుఁ డయ్యెయుకుసవరున్. 169

చ. అని గురుఁ డుగ్గడింపఁ గలయం జలమానుషకన్యలిద్దఱు కుం
చెనలును బోని సుళ్ళ నవనీరగణంబులు ప్రాంతవీానన
తఱిన చలితంబులై తోరఁగఁ బ్రాలసరిం బెఱసొంపులేర్పడం
దనపరివారదేవతలు దాను బయోధినతండు సూచుచున్. 170

క. తదుపరితీరాగ్రనభః, పదవికిఁ జని నిలిచి పొలిచెఁ బ్లక్షద్వీపా
భ్యుదయంబు షణ్ముఖుంబై, యదిరాయన నగరపట్క మద్దరిమెఱయన్. 171

గీ. చూచి గిప్పునఁ జూచిన రాచబిడ్డ, తోడనతఁ డిట్టులనియెఁ దత్పురవరంబు
లేను వేర్వేఱ నగ్ణించి యెఱుకపఱతు, ననుచు నద్భుతరస మొక్కపేనువుదాల్ప.

చ. గిరిరథమిప్పురంబు పరికించితె యల్లదె దుర్గ మద్రిపై
గిరిరథుఁ డిట్లు కట్టఁగలిగెం దనపేరన యూరు తేరుగా
వరమున వచ్చె నగ్గిరియె వానికి భర్గుఁ డనుగ్రహింప ను
త్తురథముఖోద్ధతావరజపట్కముతో నతఁ డుండు నచ్చటన్. 172

క. సాలము త్రిజగద్భీకర, కీలముగా వరముగల త్రికీలు పురము త
త్కీలత్రయి వెలుఁగునది త్రి, కీలమనుజులేవు రతనికిఁ ద్రిశూలాదుల్. 174

క. వసుజిత్పుర మది రవిశశి, వసుజిత్కరువిందవజ్రనప్రము యమజి
త్తైసఁగించెఁ గుబేరజిదా, ద్యసహోదరయుతుఁడు పిన్నతమ్ముని పేరన్. 175

గీ. కల్యదానవుండు కఠినాదులనుజులే, ద్వ్యురుభజింపనుండు పురము నివుల
నిదియ యదియ పీరసదుదగ్రనందన, పురము నేఱితోఱఁగె దొరదొఱంగ. 176

ఉ. ఆపురపంచకంబు తనయంతలపొంతల యిండ్లపిండుసూ
గోపురసౌధము ల్పరలు కొల్వునకుం డిగివచ్చు నిచ్చెనల్
చూపఱ జోలియేల యిటుచూపఱ చూపుల నాచికొన్న యీ
దీపపతాకపట్టనముఁ దేఱికనుంగొను మెంత యొప్పునో. 177

క. వేలావంతుని వెంబడి, నేలంబారాదిమేర నిదుపై యునికిన్
వేలాపురమనఁబడునది, కైలాగొదవించుఁ దరగగాడ్పులకెపుడున్. 178

సుగంధి—దానిచెంతనందన ప్రథాపిథాన దక్షునా
నానానానవద్యరత్నహర్మ్యమాలికా మయో
ద్యాన మొప్పఁ జూడు మన్ననాసుగంధి కేలికా
కాననంబుఁ జేరి డిగ్గ గబ్బిగిబ్బనాతఁడున్. 179

క. తోడనవచ్చిన శిఖియమ, రాడాదులతన్వనేక రక్షకరత్న
చ్ఛాడాకతఱినఘాతఱ, క్రీడా పరితృప్తు లైదిగిరి యానములన్. 180

శా. ఆలో నిర్జరరాజమంత్రి వసురుద్రాదిత్యసంఘుంబులన్
వేలంబు ల్వీడియించి యుత్కలముగా నిల్వంగ నందుండు య
త్కాలిం బొమ్మని దాడి యాడియెలగోలందింప విద్యాధరు
ల్సాలం జేసి విమానము ల్డిగి దిగీశశ్రేణితో నేర్పనన్. 181

వ. పురంజయుం జేరి యొక్కమహనీయసౌధంబున నుండిరనిన విని జనమేజయుం డ
వ్వలివృత్తాంతం బెట్టనిన. 182

మ. సరసప్రాభవభావ భావభవజిత్సౌందర్య దర్యంతరాం
తరయోగార్జిత జీవ జీవయసుహృద్రాజన్యజన్యాసవృ
గ్గరణీజాతపలాహ్వతద్విపఘటాకంఖాణసంవాసవా
సరరాజాద్భుతకృద్ధగగ్గరితభాసాచర్వితాశాంగనా. 183

క. భేరీభాంకారారవ, దూరీకృతవైరివీరతోయజనయనా
పారవిపాదపదవానల, వారణతరవారిధారవసుధాధారా! 184

మాలిని—వితరణసురభూజా వీరవిద్యాబిడౌజా
ధృతిగతి నగరాజా దిగ్తటవ్యాపి తేజా
మతిమహిమసమాజా మానినీహృన్మనోజా
జితవిమతసమాజా చిన్నమాంబా తనుజా. 185



ఇది శ్రీమత్తిరుమలతోడప్పాచార్యచరణసరసీరుహసేవాసమాలబ్ధసామ్రా
జ్యధౌరేయ నిజకార్యాభరణాయమాన యెల్లభూపురందలవరనం
దన మట్లనంతమహీనాథప్రణీతంబైన కకుత్స్థవిజయంబను
మహాప్రబంధంబునం జతుర్థాశ్వాసము.

శ్రీరస్తు.

# కకుత్స్థవిజయము.

## పంచమాశ్వాసము.

—:0:—

క. శ్రీవేల్పల్లోచన దీ, నావనఘన సదయహృదయ యమితాభ్యుదయా
కావేరీవల్లభ యె, ల్లావనిపాలాఖ్య ధావదహితసమాఖ్యా! 1

వ. అవధరింపుము మనసంవన కథాసుధాధారాధౌత మానసా మేయజయుం డగు జన
మేజయునకు శంపాయనుం డగు వైశంపాయనుం డిట్లనియె. 2

సీ. పవనంబు మోసెత్తి లవణాబ్ధి కమృతాబ్ధి తరగమీఁదనవచ్చు తరగవోలె
జలబలం బతిమెఱుంగులభార మెచ్చిన ధరకుఁ బ్రేలెడు శరద్ఘనము వోలె
దనుజోపవనికిఁ గాందలిరు జొంపము దాల్చి పెకలి యేతెంచు కల్పకము వోలెఁ
దనుఁజేర రిపుతేజమును మోచికొని యుట్టిపడుచున్న తద్యశోభరము వోలె
వదలు జడముడిత్రోవ నారదుఁడు వింటి, రాక దవ్వులఁ గని కుమారమణి యితఁడు
దొరగిపోయిన యెకిరింతఁ దొడఁగి వెతకు, మదనహరుఁడే మొమనగిబ్బరొదకు డిగిరొ.

క. అని తెలుపఁ దెలిసి దిక్పతు, లును దాను నెదుర్కొనఁగ నిలుచునంతనె య
మ్ముని డిగి తా నిడు నుచితా, సనపూజలు గొని మనోలసతఁ బలుకలయన్. 4

మ. ఇటఁ గూర్చుండుఁ డనంగఁ బర్వతుఁ దదీయేచ్ఛాను సారైకలం
పటు వీక్షించి సుఖాసనాదులను సంభావించి రాచూలిచెం
గట దిక్పాలురత్రోవఁ జొచ్చి మునిలోకస్వామి లేమయ్య మీ
రిటఁ జిన్నందన మొందినా రనుడు వాగీశాత్మజుం డిట్లనున్.

క. అచ్చరలాడఁగఁ గిన్నరు, లెచ్చుగఁ బాడంగఁ గనుచు నింపుగ వినుచున్
మెచ్చంగ దీపకేతున, కిచ్చక మో యనుచుఁ బోయి యెఱుఁగక యేసున్. 6

క. ఈ తెలోకోటలా మతిపని, పాటలా మీకింత యాటపాటా పోల్గా
యేటలు బాటలు బాటిలు, పాటికి వారెపుడు వచ్చిపడుదురో మీఁదన్. 7

వ. అని యింద్రవాహనుండవై నీవిట యెత్తివత్తని పల్కిన నతండు. 8

క. వారంటివి వీరంటివి, పోరంటివి మీఁదఁ బడక పోరంటివిగా
వారెవ్వరోయి పొఱుఁడ, వారనఁగాఁ దెలియ దేటివారో యనినన్. 9

గీ. ఎఱుఁగకితఁడు వెఱ్ఱి నిట్టివారన నేర, కనియెఁ జెలియఁ జూడుఁ డనుచు నొకఁడు
డిగివి చించెఁ గృష్ణమృగచర్మమపుడుప, ర్వతునిచేత నుండి బ్రతికె మహాతి. 10

క. తదనీతికిఁ బర్వతుఁడుం, బెదరఁగఁ బులినాఁకివిడిచెఁ బెక్కుల యిఁకం
బద చాలు ననుచు నేమును, నదవదపడిరాఁ ద్రికర్ణుఁడా దొరతోడన్. 11

చ. అనుచిత మిట్లు సేయుదురె యమ్మునినాథుఁ డసత్యమాడె నే
దనుజకులం బడంపఁగఁ గదా సుకుమారకుమారుఁ డింద్రవా
హనుఁ డన నమ్మహామహ మహస్కరమండలమధ్యవర్తి పు
ట్టెననెనె యింతవికటించినఁ గార్యమె మీమదాంధతన్. 12

మాలిని—పోరితము ల్మఱిపుట్టవె యేరికిఁ బుట్టిన నేమియవుంగములై
పోరరొ క్రమ్మఱఁ బొందులు సేయరొ ప్రోడలు సుస్థితిపొంటె సునా
సీరుఁడు మానిని జేటుఁగఁ జేసినచేష్టకుఁ జేష్వడఁ జేసియు మీ
వైరము మానఁడు వచ్చిరి సంధికి వారు కడంగఁగఁ వారెసురల్. 13

చ. పొనుఁగుపడంగఁ జేసి పగవుచ్చు నుపాయము లేదె వారితో
మను మెటులైనఁ బెద్దమనమా యిఁక నెట్టొకొ యుగ్రదైత్య నం
దను లసహాయశూరులు వనమ్మునఁ గ్రమ్మఱఁ గూల్చి వచ్చె నేఁ
డనిమిషరాజు నెక్కి మనుజాధిపసూనుఁడు వారుదేఱఁగన్. 14

త్వరితపదగతివృత్తము—అననదరిపడుచునతఁ డనె నొకఁడు తిర్య
ఘ్నుని దదనుజుల నొడిచికొనఁగలఁడొ నన్నున్
జెనకి చనఁగలఁడొయన సిగలుడిగి దైత్యుల్
గనునెదురఁ ద్వరితపదగతినరుగు దేఱన్ 15

వ. దీపధ్వజుండువారి నాలోకించి. 16

చ. తల లివియేమి మీపరుగు తత్తరమేమి యనంగ నంతకా
దులు వృషభాధిరూఢనరుతో మనతోఁటకు వచ్చిమమ్ము ని
ట్లలజడిఁ బెట్టిరన్న నతఁడవ్వని నేమటి నిద్రవోవఁగా
నెలుకలు గొట్టెనేమొ సిగలెక్కడిసుద్దు లిసీచనుండనన్. 17

వ. యమాదులుం దిరుగం బుట్టిరే. పుట్టిన నిట్టిపనులు దలపెట్టిరే. యంబష్టకులచేష్టల
కుం జొచ్చితిపో యని యపహసించి. 18

క. యమజిత్ప్రముఖులువీనులు, చిమచిమమన మనకుమాని చెప్పిన నయమా
ర్గము లోకడదియునిజమే, కమియఁగ లగ్గలను జొనుపఁగాఁ గలిగెనొకో 19

క. నడచిన నిలమోసినఫణి, మెడవిఱుగదె నగిన( బడవె మీ(దిజగంబుల్
తొడతొడలుగమాయలుకను, వడివడివారెదిరి మండ్రె వజ్రవిరోధీ. 20

వ. అనిపలుకుచుం బదరుచుండ విరథుండు. 21

తరల—పెరి(గి దేహము వృద్ధి మిన్నునుపేరుతేదనిపింతునే
సరిగసందియసందిదండలు చక్రవాళముమానసో
త్తరముగా ధరియింతు నీధర( దావకప్రభుశక్తికిన్
బిరుదుపెల్లిగమేరు దండము నిల్పనెత్తివహింతునే. 22

క. పోరడ(గునెప్పుడన ని, వ్వీరాలాపములదా(క వినివచ్చితినిం
ద్రాదులి(గ నెత్తినత్తురు, మీరాయతపడు(డు సమిపమే యోద్ధలికిన్. 23

వ. అనినవిని పురంజయుండు మాజతనంబు నిమిత్తమాత్రంబు దేవద్వేషులు మీకు( జేసి
న యపచారంబునన తెగుదు రనునవసరంబున. 24

—బంధురవృత్తము.—

పటపట( బగులుచు( దనతనతలనే పడ్డది మిన్నని భూమిజనుల్
పెటపెట( బెటపెట లాడవ(గ( బెలుచంబేల(గ రాల(గ( దారకలు
చ్ఛటభట కటురట దిషుశిఖిశిఖలు౦ బంధురదుందుభినాదములున్
గటకట పురిదెస( బెరు(గ(గ విఱుగం గగ్గులకాడుగ వేల్పుమొనల్. 25

క. జనమేజయతోలువేల్పుల, కొనమూ(కలు సురలనంటికొని పెడతలలం
జొనిపె( బెనుదూపులువ్వే, త్తునవిశాతలలకెల్ల(దో(కలటంచున్. 26

చ. కనలు కకుత్స్థు( డప్డు కడకంటికిఁ దెచ్చుచు జోడుదాల్చి వీఁ
పునబిగియించి విల్దొనలు భూరిశరాసనమెక్కువెట్టి వా
హనము కకుత్ప్రదేశమున కానతు(డై మఱిదా(టెదా(టె( బో
ముని యనలాదులం బనిచె మున్నగురుం డని సేయ ధీరు(డై. 27

క. అయొశ్వరు దిక్పతులకు, నాయెడ శిఖిజిత్తు యమజిదాదులతోడన్
బాయవడి యెదిరి మొగ్గర, మాయితపఱచికొని కొందఱప్పల రా(గన్. 28

సీ. అనలుండు ననలాక్షు(డును దీపకేతుమాతామహు( దా(కి రతండుదహను
వారుణాస్త్రంబున నీరార్చి యీశానుకను జెప్పనొసలిది చిను(గ నేసి
పిష్వడ్డమంటకు వివిధబాణార్చుల పోరాటపుట్టించెఁ బోర( జము(డు
తనదాయవరికిని దఱుమ( దన్మహిషమ్ముబలియు రథ్యంబుల( జెల(గి కొట్టె
విరథు( డగుచు మఱియు నరదంబు నత(డెక్క(, దత్తదశ్వములను మొత్తె( బోతు
ధనదపవనవరుణత్తదైన్యములకు( గచా, కటికతోరకలహగతులు గలిగె. 29

క. సమరము వసుజిత్తునకును, యమవరుణుల నడిమిదొరకు నయ్యెమహీయ
స్తిమిరారుణజలదమరు, త్ప్రముఖావిర్భావపరుష భావమున నృపా. 30
గీ. అనుడు నభిమన్యుపౌత్రుఁ డామునివరేణ్య, దహనజిద్వారుణాస్త్రంబు తడుపఁదడిసి
శిఖియును జముపోతు తేరి తేజీలఁదినఁగ, యమజిదసురుండు నేమేమియైరి చెపుము.
చ. అనమునిపల్కు నట్లసురయమ్మన నించుకనాని వహ్నియుం
దనతపనాస్త్రముం బరపి తజ్జలధారలఁగ్రొచ్చి వానివి
ల్లునియఁగ వానిరథ్యములు గ్రుంగఁగ వానిరథంబు గూలనే
సిన విలుఁ దేఱుఁ దెచ్చికొని చెండి యతండెగిచె న్నిఖాగ్నులన్. 32
మ. యమ జిద్వాహనుఁడుం బరేతపతి వాహద్వేషిచే నుఘ్నితా
శము గాఁ దేరిదెస న్మనంబవుర మెచ్చంబట్టె నీకంటె మే
ల్జముఁడా నీయెనుపోతటంచుఁ గదఁ బెల్చన్మోదినందిమ్ముదీ
ఱమిఁ గొమ్ముంగవఁ ద్రిప్పకొంచునది వాఱంగాలుఁ దడ్డంబుగన్. 33
చ. తఱిమి రథంబు దున్నతల దప్పిడివారినఘోరదోరసిం
దఱుఁగకపోదునే తల పదంపడి యిందఱు గాలురున్కియుక్
మఱపుగ నిల్చుటొక్కఁడన మంచిది చాలమి దెచ్చికొన్ననా
కఱగొఱుఁ దీతుఁడఁ గాక యొకకాలుఁడకా తలద్రుంపకేగదే. 34
వ. అనినజమునిపలుకులకులికిపడి రాక్షసుండు మాయామహిషంబునెక్కి పోరునప్పుడు.
మ. ఇరువాగుంగని యేమి బాసటగరాఁ డెవ్వాఁడు నం దెవ్వఁడె
వ్వరిఁ గాలుండనివచ్చు వారితెఱఁ గుల్వాయంపురజ్జాదిగా
సరికిం మాయవనిం బరస్పరగదాసంపాతలక్ష్యత్వమొ
ప్పిరి వారాసురసాధనం బెవలెమాపెం దైవముం దానవున్. 36
క. దివిజులు తొలుతాఁకునఁ ద, మ్మవిచిన దనుజులను మనుకులేశ్వరశరము
ల్పొవయనిమంటలు మింటికి, నెవయంబడి కెరప మొనసి నిలిచిరితారున్. 37
మ. అటులయ్యిందఱు సింధుమందరవియోగాభావముంజూపె ని
చ్చొటు నాఁగాఁ బెనుమూఁకలై విశిఖవీచుల్పర్వఁగా మ్రోసి యొ
క్కొక్కట దీపధ్వజుతాతఁ జుట్టికొన జూడ్కుల్మండ నొక్కొండ పి
న్నగనవ్యాంబరముం బగుల్ప నతఁడంతశ్చార దుర్వారుఁడై. 38
క. తనుఁదాఁకు తూపుమూఁకం, దనవి యొకటిరెండుమూఁడు నాల్గైదాఱుఁ
డెనిమిది తొమ్మిది పది దాఁ, కనిమేషములేక యుండఁ గాంచము లేయున్. 39
వ. అయ్యవసరంబున. 40

— పడిసీసము. —

తాఁజాలఁగలవాఁడ తనధృతినిలుపేద దరికినాలోఁ జేవ దఱిగిపోవఁ
తానేబలిమికాఁడు తనకైదువంపేదఁ దప్పదు నానాయుధంబు వృథగ
దాశరన్మేఘంబు దనతనజడివాన తఱుచునామిన్నెటి ధారలొలుకఁ
దానతమాలంబు దనవిరుల్మొగ్గలగల్లు విలెనా క్రొగ్గంట్లు పళుకులొత్త
ధనదపవన గంగాధరతపనసుతులు, దనుజయోధులు బలముతోఁ దఱుమఁబఱచి
రనలవరుణులు తమతోడి యసురఁగూడి, యవులఁరేఁగులు తంగేడులనుచుఁ బాఱి.
వ. వస్త్వాదిగణంబులు చెల్లాచెదరయ్యె నయ్యెడ. 42

ఉ. వైచినఱంకెలం దెసలు వ్రయ్యఁగ నుబ్బినగిబ్బఁ దోలుచుం
ద్రోచి నిశాచరేశ్వరులఁ దూఁటులువోవఁ గకుత్స్థుఁ జేసెఁ బోఁ
బూచెఁ గదయ్యమోదుగులు పూయకపోవునె రాజభాస్కరుం
జేచి జగంబుపారి తపమింకిట మీఁద ఫలింపఁ జేయునాన్. 43

వ. అత్తెఱంగునకు సైరింపక కొందఱసురవీరులు తమలోన. 44

ఈ. నాకులభీకదానవగణంబులతో సరిపోలువారె వీఁ
డేకులవాఁడివెట్టెఁ దనయొద్దను దాను నిటుండి వీనిము
న్నేకతమంత మజ్జమునియింటికి నంచుఁ గకుత్స్థుఁదాఁకిరా
లోకము లగ్గిసల్ల నెటులో యటనెవ్వరొ యంటివేనియున్. 45

వ. వివరింతు నాకర్ణింపుము. 46

చ. కఠినకరాలకర్కశుఁడు కల్యుఁడు నంతకజిత్తునాదిక
ర్మఠులయిదావతీక్ష్ణులయి ప్రాసగదాహలశక్తిశూల భృ
త్కఠినభుజాసమున్నమనగర్వము కర్ణకఠోరవీరవా
క్పఠనము లుల్లసిల్లఁ దగఁబాఱిరి యబ్బిగిచూచి యాతఁడున్. 47

వ. కట్టెదుటికిం జేరవచ్చి. 48

సీ. ప్రాసంబుతోఁ గఠినాసుర బాహువు గదతోఁ గరాళదుర్మదభుజంబు
హాలముతోఁ గర్కశపలలాసిబాహయు శక్తితోఁ గల్యునుద్రిక్తభుజయు
వేశూలఁదునిమినఁ గైకొన్నకైదువు ల్విడువని పిడిచేతు లెడమకేలఁ
బట్టిపైకడరు నట్టిట్టులు తలలేఱి యమజిత్తుమూర్చలోఁ జిమగఁ జేయఁ
దేరుఁబవఁదెచ్చి తత్సూతుఁ దూరుసేర్చి, నక్కబంధంబు లెదుర కొక్కసుక్క నడిన
వ్రేటునాటును నాయువు వ్రేటు చూప, కపనిగలయాత పలిశనంబివురపఁగ. 49

ఉ. ఆరభసంబునప్డు కఠినాదులచేఁ దలలేని బొందులం
జూరె కడంకలూరెనని చూపఱు మెచ్చుల మూరిఁబోయిరా
సూరెలమున్నె కన్నిడిన సూటిన వామభుజాభుజాదులం
బీరము సూపి త్రెళ్ళెనవి భీమమహోక్ష ఖురాహతంబులై. 50

క. తనకాతునేటులంబడి, యనిఁదెప్పిరు ఘూసరోము నజ్జదిమిశిరో
వనిఁ గలికి నెత్తురులుకం, దన నోరం బెలుకు వృషభదైవతరాజున్. 51

వ. నిరీక్షించి. 52

ఉ. నాలుగుడాఁచివెట్టి పెఱనాలుకలన్వేలుఁ గొందశూలభృ
త్ఫాలము కన్ను కైమువుగఁ బట్టెవనంవగుశూలమెత్తి య
క్కీలివిరోధి వేయుటకు గిబ్బచసంబరి మూతియూఁతగాఁ
గూలియు నట్టుపట్టిన కకుత్స్థుఁ గుదుర్వ్రతుఁ జేసెఁ దేరుటన్. 53

వ. అప్పు డప్పురంజయుండు. 54

శా. ఔరా యక్కఠినాదులంగలయరాదై తేనియుం దానవ
స్థలి రావేడుక రేచితీవిటులు పెల్చన్వచ్చి యుక్కోకకుం
జవిరానీవిఁకఁ జెట్టగాక దివిషజ్జాలంబుతోఁ బోరుకెం
జివురానీదగు జాతికం చొకట నేసెన్వాని మూర్ఛంబడన్. 55

చ. పెలుకుఱి ఘూసరోముఁడు కుబేరజిదాదులు నప్పు డాతఁడుం
డిలిగెన కా దలంచి పరువెత్తిరి క్రమ్మఱి సూతుఁ డగ్ని జి
త్పలలభుజు న్శిఖిధ్వజుని పాలికిఁ దెచ్చె బలంబులెల్ల దు
మ్ము లెగయఁ బాఱి చొచ్చెఁ బురిమూయనివాకిలి మూసినట్లుగన్ 56

వ. అంత దినాంతం బైన. 57

చ. వలయపువంపుగొన్న విలుపాఁదుగ వీరరసంబుచేతవ
ర్ధిలిన ప్రతాపవల్లి నలుదిక్కుల ప్రాఁకునె రాకుమారుచే
యలవునఁ గ్రుంకు కొండ నుదయాద్రి చివుళ్లొకరెండు సూపెనా
నలరె మురారి కన్నులు సురాలి కనన్రవిచంద్రు లిద్దఱున్ 58

చ. అమరులనిట్లు క్రమ్మఱచి యాటలుపాటలునై వియచ్చర
ప్రమదలు గొల్వఁ [illegible] దమపాలెపుఁ దోఁటకుఁ బోయి కోడెగు
జ్జుముడిగి కొమ్మువుట్టిన తెలంగునఁ బాపక జిత్రపయుక్తశూ
లము ను సురాడియుంపఁ [illegible] కృతిఁగాఁ గొనియాడి మెచ్చుచున్. 59

గీ. కౌంతసేన చూచియంతఁ దదుత్పాటు, నంబుఁ బిదపవాహనంబుఁ దడవి
దిగధివరులుఁదాను దగునెసగురునార, దులు జయంబువొగడఁ బొలిచెనతఁడు. 60

ఉ. అక్కడఁ బోరువిన్న యొడయం డరదేటిన తల్లిఁదండ్రితో
నక్కట నేఁడు కల్యకతినాదులలోపల నొక్కఁడేనియుం
దిక్కకపోయెనే యినుకదేఱెనె తావకశౌర్యవార్ధి యం
దుక్కివులైరె వేల్పు లొకఁ డూఱటగా నిఁక నేమి చెప్పదున్. 61

చ. అనిపలుకంగ నంత నసురాధిపుతాతయు లెస్సదేటి యె
త్తిన వలచేతి హేతిఁ దనుదెచ్చిన సూతుని వ్రేయఁబోవఁగా
మనుమఁడునట్టి నీభుజము మాకొకకోటగ నమ్మియుండఁగాఁ
గనుఁగొనుమయ్య నిన్నసదుగా ననలేవని యానమిల్లిన్. 62

చ. నిలువ కతండు మార్పెనఁగి నేఁడ కలన్మగియించి వచ్చెద
న్నిలువు మనంగ నీసరము నిక్కవమయ్యెడు మెల్లి నేఁటికిం
దెలఁచెద నిల్పుమం చతని దెచ్చి రణశ్రమ మాపుచుండఁగా
నలుగులఁ బాఱెఁబో గిరిరథాదుల రౌద్రరసంబు కొల్వులోన్. 63

క. ఆరేయి నృత్తగీతవి, హారంబుల వేలుపులకు ననుభూత తిర
స్కారజ ఖేదక్రోధవి, కారంబుల రక్కసులకుఁ గడచె నృపాలా. 64

క. పాడఁగాన మంగజాలల, నడియాలపుఁబసిఁడిబద్ద లవితూర్పవనా
వెడలియిరువాగు ననికే, ర్పడఁదోఁచెం దరుణతరణిభానుశలాకల్. 65

క. క్రందుటని చూచుటకుఁబో, లెందొలిమల యెక్కె నినుఁడు లేఁదామరపూ
విందుపొడు పిందుపొడుపై, చిందులుద్రొక్కించె నుభయసేనాంబుధులన్. 66

క. అంతకు మును మేల్కని యా, సంతమసారాతివంశజలజచ్ఛాయా
కాంతుఁడు కాలోచితకృ, త్యాంతరములు చలిపి సన్నహనసంపదతోన్. 67

శా. శ్రీమజ్జన్యకుతూహలంబు ముఖరాజీవంబు సూర్యోదయ
క్షేమావాప్తికిఁ దోడుసూపి యలరం జేయంగఁ బూజించి పౌ
లోమీవల్లభ మైనవాహనము నాలోనెక్కె నుగ్రాది ది
గ్గామిస్వాములు నూకి యుక్షరథరక్షస్సేన కుక్ష్యాదులన్. 68

క. దానవుఁ డతఁడప్పుడు తన, సేనకుఁదలమిగిలి నిజవిజిత్వర చాప
జ్యానాద సింహనాదము, లేనాదముఁబేదనాద మేసం జేయన్. 69

స్రగ్ధర— జవరాశిప్రోషవీచీ నఖముఖరమహోక్షంబులం బొల్చి వెంటం

బడిపాఁగం దేరరాఁగా బసువని నొకనిం బోఁదలాడించుకొంచు
న్నడఁగొండం గొండకాఁత్తే ననట గఱపుచు న్వచ్చెనో నాలకోకి
జడిపానం జిచ్చువానం జదుపుచుఁ బొదివె న్సర్వదిగ్రాజరాజిన్. 70

వ. అప్పుడు గురుండు కకుత్స్థునకు నుత్తరథుం జూపి. 71

చ. అజానివరంబుకల్మి నిటలాక్షుమహోక్షముఁ దాఁకి గెల్చి ది
గ్గజములమోపు మూఁపురముగాఁ గొననోపు సురాసురాస్త్రము
ల్గిజిబిజిఁ బిప్పిగా సమలుగిత్త దతీయము తాద్భశింపుట
క్కజములతేరి గిబ్బప్రకారము లాతఁ డజేయుఁ డెమ్మెయిన్. 72

గీ. ఈ...ద...య నీశుఁడేమోను వానిచే, ననఁగ నీహారాస్త్రమంది నములు
బిట్టుగిబ్బతోడఁ దేరితోరిపుఁ గూల్చె, రౌద్రబాణమునఁ బురంజయుండు. 73

చ. అనవదురాపుఁ డుత్తరథుఁ డట్టయినప్పుడు యుబ్బఁ గ్రోధముం
దముఁ బురికొల్ప నొండొరులఁ దార్కొని పేర్కొని వహ్నివహ్ని
ద్యనుయముజి జ్జలాధిప జలాదిపజిన్మఖు లాత్మనైరబం
ధములఁ బెనంగుచుండ ననిఁదాఁకె మహారథుఁ డప్పురంజయున్. 74

చ. అపుడు పురంజయుండును మహారథఘోరధనుర్భవాశుగ
ప్రసతన బాధక ప్రవర పంజరుఁడై కెలనం గృతాంతుఁపై
నుసహాతిహేతుభూత శరమొక్కటి పూనఁగ దానితోన త
ద్రిపు నటఁ గూల్చె నజ్జముఁడు దేవరగాఁగల వేఁడితూపునన్. 75

క. వెండియు భీషణశరమున, చండించి రథంబు గరిమఁ దాద్భశమహిమా
ర్దంపత మందు మహారథు, కండలు తనవింటనేకి కాకులకిచ్చెన్. 76

వ. అప్పుడు. 77

గీ. ఒక్కజిహ్వాకు పురకోటి యొత్తిగిలఁగ, నెల్లన్నపు లొండుదసనకు డొల్లిపడఁగ
జిలుఁనలోక నాలుకకుఁబెల్లగిలిచనంగ, నిద్రజిహ్వనిజిహ్వాత్రయంబు తోఁచె. 78

ఉత్సాహ- వాఖు నడఁక నపుడు గురుఁడు వానివేగఁ దునుమవే
యొకకుత్స్థ యొకకుత్స్థ యుత్తరాజ మైనయా
పాకరిపుఁడు నతని జిహ్వఁ బడన కదఁగఁ దత్క్షణ
నీకుఁ బినపఁ దెలియ ననివ నిగిడిపడుచు నాతఁడున్. 79

గీ. తనమహోక్షు మనసతన యువ్విషముకీలు, నాలుకకును దనకు నాలుగిడును
లంగరమున సుఖముసనంతలోపలదాయ, దగ్గఁజేసి బణపుదప్పు డతని. 80

బాతరువాత మే మెఱిఁగి యవ్విధిపాలికిఁ బోయి పొక్కుచు
న్మా తెఱఁగేమి చేసితివనా వరమిచ్చినతండ్రి యన్న నాఁ
డాతఁడు మీకు దిక్కుగల యాజిన చాచు నతండు నాలుకల్. 89

క. ఆగడియ యెచ్చరికతో, వేగించిన నిలుతురనియె విని యెచ్చరిక
ల్సాగునొకో యని యుంటిమి, సాగనకా యేను నీదు సన్నిధి నుంటన్. 90

వ. అని పలుకు నవసరంబున. 91

ఉ. ఏపును గ్రోధముం బెరయ నెక్కి త్రిశూలుఁడు రుద్రసంఘముం
గీడ్వడఁ గొట్టి బాణములు కేలనెకొందును ద్రోల రెండునై
తోడ్పడిరా రథంబుడిగి తూఱఁదదీయ మనఃప్రసారము
ల్చేడ్పడఁ జేసెఁ దామసశిలీముఖ మయ్యిన వంశవీరుఁడున్. 92

శా. దానశ్రేణికిరాకతండు కెలనం దత్తాపృగీశత్రికీ
లానేకాశుగ భుక్కచాకచి సముద్యత్ఫాలకల్యాణమణి
శ్రీనేతోరణ మొప్పఁదూఁటి విజయశ్రీఁ బెండ్లియైవత్తుఁగా
కేనంచుం జోరఁగాహరుం డెఱిఁగిపోయెం బోయినం గ్రక్కునన్. 93

క. మొననున్నదోరత్రికీలుం, దనయన్ననవైరివధ్యుఁ దమ్ముఁడు శూలం
బునఁ గూల్చికూలె ద్రోల, న్వినువీథిందోఁచునడుచు విధికూలములున్. 94

— అక్కిలివడిసీసము —

వినుమీవిచిత్రమీ వేధోవరాగమం బనఘయప్రతిహతంబగులలాట
కీలత్రయమునఁ ద్రికీలుండు నరుల కవధ్యుండుఁగాఁ బెద్దవానిఁ జేసె
నవిరోధిఁ గడపఁ గీడని విన్నశూలత్రయంబు కల్మిఁ ద్రిశూలుఁడైయనన్య
వధ్యుఁడై తరువాతివాఁ డొప్పఁజేసెఁ దక్కథవిన్న నృపసూతితత్రికీలు
వలనిప్రోవఁ ద్రిశూలుండు వచ్చునపుడు, గాలిసెఁదామస మీశానగురుఁడుద్రిప్పి
యన్నఁగరశూలమునఁగూల్చె ననుజుఁడతఁడు, నడఁగఁదనశూలములనబాగయ్యెబనులు.

క. రక్షోబల మప్పు డపా, రక్షోభము ద్రిప్పనిబ్బరంబునఁ బ్రతివీ
రక్షోదక్షుమతకు సమ, రక్షోణికిఁ బాసి భయభరంబునఁ బఱచెన్. 96

చ. ఇరువురు చిక్కరాజికథ కెల్లపుఁబో శిఖిజిత్త్రికర్ణుల
య్యిరువుర నప్పగించి చనియె న్మన యన్నటు లుండ దయ్యెరెం
డెరగలిమంట లంటు విడి యేగినచందము దోఁచె మండివా
రరిబలకాననంబునకు నస్త్రసిఖిల్నిగుడ న్వెలుంగఁగన్. 97

క. ఎంపఱు గంధర్వులు పడి, రెంపఱు గుహ్యకులు మడిసి రెందఱు నృపసం
క్రందను లీల్గిరి యప్పుడా, దొందడి మితిమీఱి వారితూపులు దొరఁగన్. 98

వ. నృపాలాయేమి చెప్పుదునాకర్ణింపుము. 99

గీ. దెసలు మునిఁగెమునిఁగెఁ దేలెఁదేలెఁ గపల్ స్థుఁ, గ్రాఁచెఁ గ్రాఁచెఁగల్లకల్లయనఁగఁ
గతలు పుట్టినట్టి వెతలనజాండంపుఁ, గడవఁ బెట్టకతఁడు గడవఁబెట్టి 100

చ. అడుగవుగా త్రికర్ణుని గుణావళి వానితపంబు వెన్నునిం
బడసెఁ బ్రసన్నుఁగా హరికృపం గృపగల్గి జగద్రహస్యము
ల్వెడతలనున్నకర్ణునఁ బెల్లగిలన్నకలార్థవేదియై
సడిసనినాఁడతండతని సంగరకాలమమోక్షకాలమున్. 101

క. పోరులుపుట్టిన దనుజులు, తోరానతఁ డరిగి యలుక దొడరినతూకే
ఘోరాహవకాలంబని, నారాయణుఁ డానతిచ్చినాఁ డాతనికిన్. 102

ఉ. కావున మోక్షకాలమయి కర్గెఁ ద్రికర్ణుని కల్కి యత్తఱిన్
భూవరవహ్నివైరిపయిఁ బోయి పురంజయుఁ డెట్టులాడుచు
న్నావల దిప్ప డీవని మరల్చె ననాదికి మానవాస్త్రర
క్షావిధి దీపకేతునిహజారముమ్రోలికివాని తేరితోన్. 103

ప్రహరణకలిక—అరదముడిగి యంపతఁడును గనునీ
రరలఁగఁ గోలువై యొనరదనుజకే
సరిఁగని వినవే జయహలహలికా
పరభట భయదప్రహరణకలికా. 104

ఉ. తూలెఁగదయ్య నీప్రెగడవోయి కృతాంతునికొంప నేరుపు
ల్చాలఁబోఁ ద్రికీలుఁడుఁ ద్రిశూలుఁడు హానినుఁ బాసిరంచు వి
ల్వాలుఁగనైచి పడ్డ ననలధ్వజమేరువు ద్రెళ్ళెఁ జంపుసాం
పాలుడివో హజారపుటజాండమునం బవివోని మూర్ఛిలెన్. 105

క. డిల్లంబులైన మేనుల, నుల్లంబులఁ దేల్చికొనిరణోత్సవరతి రా
గిల్లిరి తమ్మూర్ఛయుఁబో, గిల్లిరి యుపచారవిధుల గిరిరథవిరథుల్. 106

గీ. మగుడ దీపకేతుఁ దిగిచి యయ్యురవుర, నున్నతాసనమున నునిచిరపుడు
నడుము విఱిగిపడిన నగరాజుఁ గ్రమ్మఱ, నడికినిలిపినట్లు యవనినాథ. 107

వ. అప్పు డద్వీపధ్వజుండు. 108

గీ. అన్నిచిక్కులవరముల య్యసురులొంప, సుడియఁ డెఱుఁగునె గీష్పతి నుడువకున్న

సమరవిద్యాధురంధుల యాంద్రవిడిచి, వానిఁ జెఱసాలఁబడవేయఁ గానవైతి. 109

క. అని యొల్లఁబోవఁదాపము, కనుకని పోఁదేర్చి పాపకర్మపుటోడయా
ననుబంచిన మనకించిన, పనియుంచవె యంచు నతనిబలుకుఁ బ్రతాపిన్. 110

చ. గిరిరథుఁ జూచి నీతిపరికించి త్రికర్ణుఁడు నీవుముట్టి య
ప్పురుసున నగ్నిజిత్తునకు బాసట గండరిసైన్యవార్ధికిం
గరయుఁ గకుత్స్థుతాఁకునను గట్టునునై యొకఁడున్నయాంతకుం
ఖురుషన కొప్పకిప్పటికిఁ బొంగకుమ్రింగడు వేల్పుమూఁకలన్. 111

క. ఇదివినుమా మొనదెరలిన, వదలక యేనొకఁడఁ దారవైపున మొదలం
దవధీనమాననశత, ప్రవరము నాయొత్తిచన్నరథముం దెచ్చెన్. 112

చ. తుదినిటు రాజుతోఁ బొమటుఁ దోలుదు గుంపులనంచుఁ దాతయొం
టిఁ దొవరినాఁడు కావున వడిం జనకుండిన నీతిగా దనం
గవలెఁ గృశానుకేతనుమొగంబునఁ దానొకమ్రొక్కువైచి పో
పొదమని తిమ్ములున్నదుఁ బోరికి నద్రిరథుండుదగ్రతన్. 113

చ. గిరిరథమెక్కి తమ్ము లిరుఁగ్రేవ గిరివ్రయ మట్లు దవ్వులం
దురమునఁ దేరులై యొదవఁ దోఁబడి వాగులవచ్చు లీలరాఁ
గురియఁగఁ దేరిమీఁది పురికోటల కేతనదండకోటులన్
జిరిగిన నింగిమేన వడిసెం బయిపైనరక్తపూరమున్ 114

వ. చేరం జనునప్పుడు. 115

క. లావలికించిన మొదలివ, లావలికించిన తెఱంగు లవలవలైకా
లావలికి నిడిన దనుజబ, లావలికిఁ గకుత్స్థుఁ బొదువ నల నపు డొదవెన్. 116

గీ. బలపయోరాశితోఁకలపట్టు మునుగఁ, నిలిచి యీఁదు తిమింగిల గిలగిలములొ
యింద్రుఁ డెద్దైనమరలు మహీధరములొ, వెడలు నడదీవులో యనవిరథరథులు. 117

క. దానవసైన్యము వెలువడి, మానవలోకేశగణ మమర్త్యగణము నీ
కౌనాకానని మారొ్కన, రానపుడెదిరించి రచలరథునలాదుల్. 118

వ. ఆయేద్వురయందును దలకడచి దహన దంష్ట్రధర దర్పక ద్విషులు తమవాహనంబు
లం దటిమి యయ్యవసరంబున. 119

క. మనిపట్టు మనియె మస్తక, మనినట్లనినారు ద్రష్టలయినట్లయ్యెన్
బనిదాఁకెఁ దగటు గిరి న, య్యెమబోతును నెద్దుఁ జావలే కొండాడన్. 120

ఉ. అమ్మెయిఁ దద్రథాచలము సంటెకఁ గొమ్మల మస్తకంబు పే

